# శ్రాద్ధవిధానము

స్వామి తత్వానంద విరచితము

శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి పీఠికతో



ప్ర కా శ కు లు

ది ఓరియంట్ పవర్ ప్రెస్, తెనాలి

1940



వెల 0—12—0

# తొలిపలుకు

పరివర్తనశీలమైన యీ జగత్తులో క్రమవికాసము చెందుతూవుండే మన జాతీయ కార్యవిధానములను గూర్చి విచారించు చున్నప్పుడు వాని వివిధ దశాపరిపాకమునే మనము గమనించవలసియున్నది. గతించిన ముప్పైయేండ్లలోను జాతీయోద్యమము ఎన్ని పరిణామాలు చెందుతూ వచ్చినా జాతీయవిద్యాగౌరవానికి మాత్రం హానిరాకుండా కాపాడుతూ వచ్చినాము. ఇన్నాళ్లనుంచి మన జాతీయవిద్యా మహాశయాన్ని ప్రభుత్వం మన్నించకపోయినా ఈ నాటికి రాష్ట్రప్రభుత్వాలకు, కాంగ్రెసు ఆశయాలకు ఏకీభావం కుదిరియుండుట సంతసకారణము. ఈ రెంటి సమాగమ ప్రభావం వల్లను మనసంస్కారస్రవంతి వెల్లివొడిచి గంభీరమై జాతికి నూతన జీవమును పునఃప్రతిష్ఠను సమకూర్చగలిగియున్నది. ఇట్టి శుభముహూర్తాన గాంధీగారును, కాంగ్రెసు మహాసభయు ఉపదేశించిన వార్ధావిద్యావిధాన వ్రతాన్ని ఢిల్లీప్రభుత్వము రాష్ట్రప్రభుత్వాలుకూడా ఆచరించడానికి సంకల్పించడం సంస్తవనీయము. జులై పదియవ తేదీన మద్రాసుప్రభుత్వమువారు తమిళ మళయాళ ప్రజలకోసం కోయంబత్తూరులో అధ్యాపకుల నీ నూతన విద్యావిధానమందు శిక్షించు కళాశాల నారంభించినారు. ఈ నూతన విధానమును ఆంధ్రజాతీయ కళాశాలవారు సిరుదే చేపట్టి కొంత కృషి చేసియుండిరి కాని జులై 20వ తేదీతో నా కళాశాలకు మరల నొక దశావిపాక మారంభమైనది. దక్షిణజిల్లాలకు కోయంబుత్తూరు కళాశాల ఎట్టిదో ఉత్తరజిల్లాలకు ఆంధ్రజాతీయ కళాశాల అట్టిదైయున్నదని ప్రభుత్వమువారు ప్రకటించియున్నారు.

ఒక్కొక్కకాలంలో ప్రజలలో ఒక్కొక్క విషయమై అభిప్రాయభేదాలు పొడచూపి, వాదోపవాదాలు ప్రబలి మత భేదాలు పాతుకు పోవడానికి కారణమౌతూ వుంటవి. సమ్రాట్పాలనమనీ, సామంతపాలనమనీ, స్వదేశభిమానమనీ యిలా కొన్ని స్థూలవిషయాలలో ముందు భేదాలు పుట్టి స్థలాంతరముల వానినుండి శాఖాంతరములు బయలుదేరి వానినుండి ఉపశాఖలు మొలుచుకువచ్చి వ్యవహరిస్తూవుంటవి. మద్యపానము మంచిదా చెడ్డదా, చెడ్డదైతే చప్పగా వర్జించాలా మితపానంచెయ్యాలా అనీ, వస్తూత్పత్తి మనం వాడుకోవడానికా ఎగుమతి కోసమా అనీ,వర్తకంచేయడం లాభంకొరకా ప్రజాసేవకొరకా, అనీ, మతానికి కళలకు సంబంధం వుండాలా అక్కరలేదా అనీ, యంత్రాలు కళలకు సాధకాలా బాధకాలా అనీ, కళలకు పాండిత్యం అవసరమగునా కాదా అనీ, విద్యార్జనము వృత్త్యాచరణము ఉమ్మడిగా చేయడం

మంచిదా సొంతగా చేసికోవడం మంచిదా అనీ, విద్యాలయాలు స్వతంత్రంగా వ్యవహరిస్తే మేలా ఏకతంత్రబద్ధములై ఒక్కడుగున నడిస్తే మేలా అనీ, పరీక్ష అవశ్యం భావియైన అర్థమా అపరిహార్యమైన అనర్థమా అనీ, ప్రభుత్వోద్యోగాలకు పెండ్లిండ్లకు పరీక్షాపట్టములే పరమ ప్రమాణములా అనీ, ఇహమాత్ర సుఖంగాసాగ డానికి దండభీతి లోకభీతులే సాధనాలా, పాపభీతి ఆస్తిక్యము ఆత్మప్రేరణ సాధ నాలా అనీ — ఇలా అనేకంగా ప్రజలు వాదోపవాదాలతో ఉబుసుపుచ్చుతూ వుంటారు. రాజతంత్రజ్ఞులు, మంత్రవిదుల, పంతులు, సంస్కర్తలు, శాస్త్ర వేత్తలు, అర్థనీతిజ్ఞులు ఆ యీ విషయాలు ఇదమిద్ధమని తేల్చవలసి వుంటుంది. ఇందు కొన్నిటిలో కాంగ్రెసుగోత్రులమైన మాకు గూడ ప్రసక్తి వుంటుంది. విద్యా విధానం పునర్నిర్మించడ మెలాగ అనేది వాటిలో ఒకటి.

చదువు. వ్రాతా నేర్చినవారే విద్యావంతులనీ తక్కినవారు కారనీ లోకంలో అపో హయితే ఒకటి వున్నది; గాని మన దేశంలో మాత్రం ఎందరో పండితులు, ఉలే మాలు నిరక్షరాస్యులుగనే ఉండేవారు. చక్షురక్షర సంయోగంతో నిమిత్తం లేకుం డానే ముఖాముఖిని మనదేశంలో విద్యాప్రచారం జరుగుతూ వుండేది. విద్యావిధానమే కాక, మన సంస్కార సంప్రదాయరక్షణం కూడా పుత్ర పౌత్ర పారం పర్యంగా జరుగుతూ ఉండేది. మనదేశంలో తండ్రులే గురువులు! గృహములే గురుకులాలు! ప్రతికుటీరము కర్మాగారమే! నిత్యకృత్యములన్నీ కళాకౌశల్యాపాదకాలే! కర్మ కలాప నిర్వహణం తప్ప వేతే పరీక్షలంటూ లేవు. నిర్మించిన వస్తువులే బిరుదు పట్టాలు. ఈ విధంగా ప్రతి కర్మకారుడూ ఆచరణ ప్రచార ప్రసంగాలు చేస్తూ శిల్పి శేఖరులను, కళాపూర్ణులను సేవిస్తూ జీవిత మనే కళాపరిషత్తులో స్నాతకు డయ్యేవాడు.

ఇటువంటి సంప్రదాయం గల మన దేశంలో పాఠశాలలంటూ ఏర్పరచారు. ఏర్పరచి దేశ కాల భేదాలు గమనించక బాలకుల కుల శీల ధర్మములలో అభిరుచు లలో ప్రవృత్తులలో బుద్ధి సంపదలో వుండే భేదాలు పరిగణించక, జడత్వమూ విసువూ పుట్టేటట్టు అందరికీ ఒక్కటే పాఠం చెప్పి ఒక్క అచ్చులోనే పోత పోయడం ఆరంభించారు. ఇలా ఏకదాయిని గట్టి తోలడమూ, నోరు వగలదీసి కూర డమే గాని ఇది చదువూకాదు, దీనిలో సంస్కారమూ లేదు. ఇటువంటి ఈ చదువులపేరిటి జూదములో అదృష్టవంతులు పరీక్ష పందెములు గెలుస్తున్నారు. తక్కినవాళ్లు ఓడుతున్నారు. ఆ పైన ఇక నే మున్నది! సర్వశూన్యము. ముందు

నుయ్యి, వెనుక గొయ్యి, ఎటుచూచినా అంధకారం. విశ్వకళాపరిషత్తులంటూ ఏర్ప డిన యీ యెనభై ఏండ్లనుండి ఇదేవరుస. ఇంకా ఎన్నాళ్లు భరిస్తాము యీ వ్యర్థ ప్రయాస? ఈ ఒంటికాలి భరతం ఇంకా ఎన్నాళ్ళని ఆడతాము ?

మనము తల్లి గర్భమునుండి బయట పడినది మొదలు నిత్యము జ్ఞానం ఆర్జిస్తూనే వున్నాము. మొట్టమొదటిలోనే అప్రయత్నంగా ఊపిరిపీల్చడం, ఏడవడం నేర్చు కున్నాము. అకారణంగా నవ్వడం, ఆకలియైనప్పుడు ఏడవడం, శరీరధర్మాలు నిర్వర్తించడం, ఇవన్ని ఎవరు నేర్పారు మనకు? ప్రక్కమీద పొరలాడటం, బోర్ల పడటం, కూర్చోవడం, పాకడం, నిలుచుండటం, నడవడం, పరుగెత్తడం, పడడం, లేవడం, గంతువేయడం, ఆటలాడడం క్రమంగా నేర్చుకొంటున్నాము. తొక్కు పలుక్కులు పలుక్కుతూ మూడేళ్ళు వచ్చేటప్పటికల్లా వాక్యరచన చేస్తూన్నాము. అయి దేండ్లు నిండేడప్పటికి పిల్లలు మనతో వాదన మొదలుపెట్టి బోల్తా కొట్టిస్తారు. ఏడేళ్ళ పిల్లలు ఏవో ప్రకృతివిషయాలను గురించి శంక చేయడం మొదలుపెట్టితే శాస్త్రజ్ఞులుకూడా నిరుత్తరు లవుతారు. పదేండ్లకల్లా అప్పుడే స్వతంత్రాలోచనా,కల్పనా శక్తి అలవడతవి పిల్లలకు. పదునాలుగో ఏట ఏదో పనిచేయుడం నిర్మించడం ఆరంభిస్తారు. పదునెన్మిదేండ్లకు మంచి పనివాళ్ళయి కుర్చీలు, బల్లలు చేస్తున్నారు. ఇండ్లు కట్టుతున్నారు. నగలు నాణెములు చేస్తున్నారు. చిత్రికపని నగిషీపని, కుందనపుపని నేరుస్తున్నారు. శిల్పములు రచిస్తున్నారు. వన్నెచిన్నెలు జిలు గులూ చూపుచున్నారు. తమతమ పనులలో వంట, బట్టలనేత, రోగులకు పరిచర్య చేయగలుగు తున్నారు. పంటలు పండించి పోస్తారు. తోటలు నాటుతారు. పశుపా లనం చేస్తున్నారు. ఇలా ఎన్నని చెప్పను ? ఒక పనియూ, ఒక వృత్తియూ, ఒక శిల్పమూ ? అన్నిటిలోను ప్రయోజకులు అవుతున్నారు గదా? ఈ విద్యలన్నీ ఏ పాఠశాలలో నేరుస్తున్నారు ? వీరందరిని ఎవరు పరీక్షించి జయపత్రా లిస్తున్నారు ? ఇంట్లో తలిదండ్రులు, బయట మేస్త్రీలు, మేటిపనివాళ్లు, వాళ్ళ సంఘాలు—వీరే గదా మన యీ విద్యలను, కళలను, సంస్కారమును ఇన్నాళ్ళు కాపాడుతూ సజీవంగా వుంచుతున్నది. కాబట్టి ఈ కళా సంప్రదాయమును పోషించి రక్షించే పాఠశాలలు కావాలి మనకిప్పుడు.

ఈ పాఠశాలలలో కల్పనాకౌశలము నిర్మాణదక్షత అలవరచాలి. ఈ సౌందర్య బోధము, శ్రుతిపేయత పట్టు పరచాలి. రమణీయతతో పాటు ప్రయోజకతనుకూడా సాధించి జీవితావశ్యకతదములైన సమస్తోపకరణములకు రసమయం చేసే శక్తిని అనుగ్రహించేవిగ ఉండాలి ఆ విద్యాశాలలు.

మన పూర్వులు ఈ విధంగా సంఘాన్ని యావత్తూ పరస్పర సహకారం చేసికొని అద్భుత సమాఖ్యగా నిర్మించారు. ఒక్కొక్క వృత్తిని చేపట్టిన సంఘాలన్నిటికీ ఆ మహాసమాఖ్యలో భాగస్వామ్యముండేది. ఆ వృత్తిని ఆచరించే సమష్టి కుటుంబాలన్నీ ఉపసంఘాలుగా ఉండేవి. కావుననే మన మాతృభూమి పూర్వం ఏ కొరతా లేక సర్వ సంపత్సమన్వితమై వుండడమేకాక మన గ్రామములన్నియు కూడా సుసంపన్నములుగా ఉండేవి. మన దేశాన్ని ఆవరించిన నిర్వ్యాపారత్వం పారదోలడానికి ఇంతకంటే వేరే సాధనం లేదు. మనం కూడా పశ్చిమఖండాలలో వలే రాకాశియంత్రాలు నెలకొల్పి మన వాడుకకు మించిన విపరీత వస్తుసముదాయాన్ని ఇతరదేశాల నెత్తిని రుద్దాలని ఉత్పత్తిచేయడం మొదలుపెట్టితే మనం కూడా ఆ యంత్రరాక్షసులకు బలియై. హిలోధికమైన నిర్వ్యాపారత్వం అవశ్యం మనకు సంఘటించి తీరుతుంది. కనుక మనము నూతన విద్యాసాంప్రదాయాన్ని నిర్మించేటప్పుడు ముందేమి జరుగుతుందో అని పారజూడాలి.

ఇంతకు మనపిల్లలను విద్యావంతులను చేయడం మనదేశానికి కొరత లేకుండా చేసికోడానికేగాని, ఇతరదేశాలలో పోటీబడి వస్తూత్పాదన చేయడానికి కాదుగదా? అట్లాంటప్పుడు ప్రతిమండలము, ప్రతి తాలూకా, ప్రతిగ్రామము కొరత అంటే ఏమిటో ఎరుగకుండా సుసంపన్నములై సుఖించడానికి సాధనభూతములైన కుటీర పరిశ్రమల వల్ల మన బాల బాలకలకు అభిరుచి, ఆదరము, పక్షపాతము కలిగించి తీరాలి. ఈ ఆశయాన్నే వర్ధా సంప్రదాయం సాధింపదలచినది. కర్మద్వారా విద్య గరపడం, పనిచేసి నేర్పటం, ఓటమిద్వారా గెలుపు సాధించడం—ఇదే వర్ధా సంప్రదాయములోని ఆంతర్యం. సంశయాత్ములైన ప్రజలకు ఉదాసీనులైన ఉద్యోగులకు దీని ఆశయాలు క్రమంగా గాని బోధపడవు. పదునెన్మిదేండ్లనుంచి పెదవి విరుపులతో మూతి ముడుతలతో ఖద్దరును ప్రతిఘటించి ప్రతిఘటించి నేటికి గదా ప్రభుత్వోద్యోగుల దాని ప్రభావానికి రిచ్చపడుతున్నారు.

ఖద్దరు అర్థనీతిని క్రొత్తబాటల నడుపుతూవున్నది. అర్థనీతికి విద్యా సంప్రదాయానికి గాఢమైన సంబంధం వుంటుంది. దానివల్ల నిది, దీనివల్ల నది మార్పుచెందుతూ వుంటవి. ఖద్దరు, గ్రామపరిశ్రమలు నేడు ఎట్లునో పాదుకకొని పోయినవి గనుక తదనుగుణమై, తదనుసారియైన విద్యా సంప్రదాయాన్ని కూడ కాంగ్రెసు ప్రతిష్ఠించవలసి యున్నది. బ్రిటిషు ప్రభుత్వము తన అర్థనీతికి అనుగుణమైన విద్యాసంప్రదాయాన్ని ఈ దేశములో నెలకొల్పినది ఆ బ్రిటిష్ అర్థనీతిని మార్చి దాని

స్థానే క్రొత్తఅర్థనీతిని ప్రతిష్ఠిస్తున్నట్లే ప్రాత విద్యాపద్ధతిని మార్చి దానిస్థానే క్రొత్త సంప్రదాయాన్ని నెలకొల్పవలసి యున్న దని మనమిప్పుడు గ్రహించడం మంచిది. ఒక్క ఈ విద్యాంగమునే అన్న మాటేమిటి? ప్రాతజీవితాంగముల నన్నిటిని చప్పగా తుడిచిపెట్టి నూత్న జీవనసౌధ నిర్మాణానికి మళ్ళా అడుగుపెట్టబోతున్న సుముహూర్త మిది. మన పెద్దలకుమాత్రం యింకా ఆ ప్రాతపద్ధతులపైని మోహం పోకుండా వున్నది. సస్పృహంగా వెనక్కు చూస్తున్న చూపులను వారు మర లించుకోలేకున్నారు. మన తల్లిదండ్రులేమో అనుత్సుకులుగా నున్నారు. మన పిల్లలు మౌఢ్యములో మునిగియున్నారు. గురువులకు అర్కప్రదక్షిణం తప్ప పురోగమనం లేదు. కాబట్టి వీరితో ఆలోచిస్తూ కూర్చుంటే కుదరదు. ఇన్నాళ్ళ ప్రాతబాటలకు అలవాటుపడిన వీరందరిని ఇప్పుడు క్రొత్తబాటలను నడువమంటే వారికి సాధ్యమా! వారు సదా శుష్కవాదాలతో తలపట్లు పట్టుకొంటూనే యుంటారు. వెనక మనం సత్యసమరారంభం చేసినప్పుడు మాత్రం వీరికి ఆలోచన తెగిందా? అప్పుడు మన కనుకూలించారు గనుకనా, ఇప్పుడు సత్యసమర ఫలితంగా జరుగుతున్న నూత్నసృష్టి కనుకూలించడానికి? మన దెప్పుడూ ఎదురీతే! కాబట్టి లక్ష్యాన్ని ఏమరకుండా మన సృష్టి మనం చేసుకుపోతూ వుందాము. విద్యాంగము, అర్థనీతి వేరు వేరు అంగములు కావనీ వాటికి అభేదమనీ గుర్తెరిగి సర్వాంగ సుందరమైన సృష్టిచేసి చూపుదాము. ఆస్తి నాస్తి వాదముల మధ్య నేడు నలుగుతూ వున్న యీ వర్ధాసంప్రదాయమే ఆ మహాసౌధ నిర్మాణానికి మూలభిత్తిక యని కాలమే నిరూపిస్తుంది.

కర్మలద్వారా బాలబాలిక సంఘంతోను, ప్రపంచంతోను సంబంధం కలిగించడమే యీ సంప్రదాయముయొక్క విలక్షణత్వము. పిల్లవాడికి మనం విద్య ఎందుకు చెప్తున్నామో ఆ కారణమును సుస్పష్టం చేయడమే తప్ప ఇందులో క్రొత్త ఏమీ లేదు. మా ఈ పుణ్యయాగానికి చేయూత నిమ్మని అందరిని వేడుకొంటున్నాము. గ్రామోజ్జీవనం చేయండని బోధించడంకాదు ఇప్పుడు మనంచేసేపని. గ్రామోజ్జీవన భారవహులను నిమంత్రిస్తున్నాము. పల్లెలకుపోయే యూపంతుళ్లిక కేవలం పంతుళ్లు కారు. గ్రామస్థులకు మార్గదర్శకులు, మిత్రులు, ఉపదేష్టలునై దేశ క్షేమనికి మూలాధారమైన గ్రామజీవనచక్రాన్ని తమచుట్టుత్రిప్పుకొంటూ, పల్లెలను భాగ్యభోగ్యములకు ఆటపట్టులుకావించి, భారతీయ సంస్కారమును సుసంపన్నములును సజీవములును ఐన గ్రామములద్వారా రక్షించే భారం వారిపైన మోపుతూన్న దీ వర్ధాసంప్రదాయము.

దిఙ్మాత్రముగా సూచితమైన వర్ధావిద్యావిధానమునుగూర్చి తెలుగు భాషలో సవివరముగా వ్రాయబడిన గ్రంథములు లేవనవచ్చును, దీర్ఘకాలమునుండియు గల యీ కొఱతను దీర్చుటకు శ్రీ తత్వానందులు వ్రాసిన యీ గ్రంథము ఉద్దేశింపబడినది.

వర్ధావిధానమును గూర్చి ఇంత సాంగోపాంగముగను, కూలంకషముగను సవిస్తరముగను వ్రాసిన రచయితను, ప్రకటించి ధన్యులైన ప్రకాశకులను నేనభినందించు చున్నాము.

ఆంధ్రదేశమందు వర్ధావిధానముయొక్క సమగ్రతకును వ్యాప్తికిని యీగ్రంథము వుపకరించ గల దని నొక్కిచెప్పగలను

మచిలీపట్టణము
భాద్రపద శుద్ధ
చతుర్దశి
ప్రమాది సం॥

డా॥ పట్టాభిసీతారామయ్య

# పీఠిక

పెక్కండ్రు ఉపాధ్యాయులును, పాఠశాలల ఉపద్రష్టలును సయితము వార్ధా విద్యావిధానమును గురించి సంగ్రహముగను సుగ్రాహ్యముగను ప్రధానసూత్రములను వివరింపుచు తెలుగున నొక గ్రంథమును వ్రాయు డని నన్ను కోరియుండిరి. ఆ కారణముచేత ఈ గ్రంథమును రచించుట యైనది. వార్ధావిద్యావిధాన మూలసూత్రముల యొక్క వివరణమును సందర్భానుసారముగ ఆ యా స్థలములందు చేర్చి యున్నాడను.

వృత్తివిద్య తప్ప తక్కిన అంశములందు ప్రస్తుతము అమలులో నున్న విద్యయు ఈ వార్ధా విద్యయు ఒక్కటే యను భ్రమ చాలమందికి గల్గు ప్రకటిత మగు చున్నది. ప్రస్తుత విద్య పరదేశ పరిపాలకవర్గము వారి అవసరముల దీర్చుటకై యేర్పడి యుండ వార్ధావిద్య విద్యార్థి యొక్క, అనగా, భారత జాతియొక్క జీవితావసరముల కుపకరించుటకై యేర్పడిన దని జ్ఞప్తినుంచుకొనవలయును. ఈ నాటి పాఠశాలలలో పాలకులు నిర్ణయించిన విషయములనే వారి భాషలో నేర్పవలసి వచ్చుచున్నది. పరభాషలో పాండిత్యమును గలిగినగాని ఏ విద్యాంశమును పూర్ణముగ గ్రహించు వీలు లేకున్నది. ఇంతియగాక వారు అనుమతి చూపిన పుస్తకములు తప్ప ఎంత శ్రేష్ఠమైన వైనను పాఠశాలలందు ఉపాధ్యాయుల చేతులలోగాని విద్యార్థుల చేతులలో గాని, తుదకు పుస్తకాల అలుమారులలోగాని తదితర గ్రంథములకు తావు లేదు. ఇంకను విచిత్ర మేమన ఉత్తమ తరగతికి చెందిన గ్రంథములకు బడులలో ప్రవేశార్హత నిరాకరింపబడుటయు అనర్హములగు పుస్తకములు ప్రవేశపెట్టబడుటయు తఱచుగ సంభవించుచున్నది. ఈ విషయము పాఠశాలా పరీక్షకులకును ప్రధానోపాధ్యాయులకును విడిచి ఉపయోగింపబడు పుస్తకములం గూర్చి వారినే బాధ్యత వహింపజేయుట లెస్స. అప్పుడు వారు తమ శిక్షణ క్రింద నుండు విద్యార్థుల కనుకూలించు వానిని నిర్ణయించుకో గలుగుదురు. మనము నియమించు విషయములను బాలుడు నేర్వవలయు నని విధించుట కన్న బాలున కనుకూలములగు విషయముల గుర్తించి వానినే నేర్పుట సమంజసము. మఱియు ఏ విద్యాప్రణాళికయైనను త్రికరణములకు నుచితరీతిని శిక్షణ గఱపునదిగ నుండ వలయును.

ఎంతటి మనీషాగ్రణి యైనను దూరముగా గూర్చుండి సిద్ధాంతరూపమున బోధనీయాంశముల నిర్ణయించుట విడ్డూరమగుపని, విద్యాప్రణాళిక సర్వమును బాలుని

సహజ ప్రవృత్తిని క్రమ వికాసము ననుసరించి యుండవలయును. ఈ యంశము సూత్రప్రాయముగ ఈగ్రంథమున 50 వ పుటకు ఎదురుగ నున్న పటమున సూచింప బడి యున్నది. దాని నొకింత వివరించుట యుచిత మని తోచెడిని. (ఆ పటముం జూచుచు దీనిం జదువుట మంచిది.)

బాలుడే విద్యాక్షేత్రమున కంతకును అధిష్ఠాత. సమస్తశాస్త్రములును, కళలును, పరిశ్రమలును, ప్రతిష్ఠాపనలును వాని అవలోకనమునకు ఫలితార్థముగా అతడు గావించు భావప్రకటనమును క్రియాప్రవృత్తిని ఆధారము చేసికొని ప్రవర్ధనము కావలసినవే.

శిశుదశయందే ప్రకృతి అవలోకనము సహజముగ ప్రారంభ మగుచున్నది. బాలుడు మున్ముందుగా గిలకపంప్లు, లక్కపిట్టలు. తదితరమగు ఆట వస్తువులు పరిశీలింప సాగును. వాని ఆటలందును జ్ఞాన పిపాస అవ్యక్తమై మఱుగుపడి యున్నది. క్రమేణా పూలమొక్కలు, చెట్లు మొదలగు వానిని, పిల్లులు, కుక్కలు, ఆవులు, దూడలు, చిలుకలు, పావురములు, మిడుతలు, కంబళిపురుగులు, సీతాకోక పురుగులు, తూనీగలు మున్నగువానిని పరికింప మొదలిడును. ఈ పనులన్నియు ఇందు పేర్కొనబడిన వరుసను జరుగునని తలంపదగదు. యథాలాభముగ ఈ పనులు జరుగును. ఇయ్యవియే పరిణతదశయందు సామాన్యశాస్త్రములకు అనుకూలములగు పునాదులగును. ఈ సరణినే నర శరీరాకృతిని, అవయవములను, వాని చలనములను బాలుడు పరిశోధించును.

నరుడు స్వాభావికముగ సాంఘికజీవి. అనగా ప్రతిమనుజుడును ఇతరులతో సంబంధము కలుపుకొనుచు వర్తించుటకై కోరుచుండును. కావున అతడు తన భావములను ఇతరులకు దెలుపుటకును, వారి భావములను దెలిసికొనుటకును ఉత్సుకత గలిగి యుండును. అందువలన భాషాప్రకటనము సాగును. దీనింబట్టి వార్తలు కథలు చెప్పుట, గీతములు పాడుట సాగును. దానంజేసి వాక్పాటవము, గ్రంథ రచనము, నాటకముల కూర్పు, చిత్రరచనము వెలయగలవు. ఈ ప్రవృత్తి రస ప్రపూర్ణమైన కొలదిని నాటకములందు చిత్ర రచనలందును భావప్రకటనము ప్రాధాన్యత వహించును. చిత్రకళలు, వింతలు గొలుపు చేతిపనులు మున్నగునవి ఆ భావప్రకటనమునకు ఫలితముగా ప్రారంభమగును.

భాషాప్రకటనము, భావప్రకటనము ననుసరించి క్రియాప్రకటనము సాగును. దీనివలన నాటకాలు, చిత్రరచనలు, లలితకళలు బలపడుటే గాక ఆరామకృషి

(పూలచెట్లు, పండ్లచెట్లు పెంచుట) చిత్రముగ కాన్పించు వస్తువులను సేకరించి పెట్టుట, ఎచటికేని ప్రయాణములు చేయునప్పుడు అచ్చటి విశిష్టవస్తువుల పరికించుట, ఆ యుత్సాహము పెంపున తిరుణాళ్ళకు ఉత్సవాదులకు వెడలుచుండుట సంఘటిల్లును. పరిచితములగు పశు పక్షి కీటకాదులను ఆదరముతో చూచుట, వానిని పెంచుట, వానితోడి వినోదములు సల్పుట స్వభావసిద్ధములై పరగును. ఇంతవఱకును బాలుడు ప్రత్యేక ప్రత్యేకముగా వ్యష్టిపదార్థముల అవలోకనము చేయుటను గూర్చి ప్రస్తావించితిమి.

బాలుడు పెద్దవా డగు కొలదిని ఇల్లు, బడి, గ్రామము, దేశము మున్నగు చోటుల సంఘజీవనము నవలోకించును. అనగా అతడు మొదట గాంచుచు వచ్చిన వానినే పరస్పర సంబంధము గలవానిగ (ప్రత్యేకమగు వ్యష్టి వస్తుదృష్టిని దాటి) గమనించుట ప్రారంభించును. తాను జూచు మనుజులను పరస్పరము సంబంధము లేనివారినిగ గాక ఒకరితో నొకరికి ప్రమేయము గల తండ్రిగను, తల్లిగను, ఉపాధ్యాయుడుగను, విద్యార్థిగను, సహపాఠిగను, బంధువుగను, అధికారిగను పాటించును, ఇటుల పౌరజీవనమును గమనించువా డగును. ఆ యా స్థానిక వైచిత్ర్యముల గనుగొనుట భూగోళ విజ్ఞానమునకు అంకుర మనవచ్చును. భారత దేశమున దైవభక్తి యెక్కుడు. అది ఎంత మూఢముగ నున్నను దాని ప్రభావము ఎల్లరిమీదను అనివార్యముగ పడుచున్నది, మనజీవితమున ప్రతికార్యమునకును మత సంబంధము కూర్చబడియున్నది. అనగా నీతి, ధర్మము, న్యాయము సర్వత్ర గుర్తింపవలసి యున్నది. బాలుడు ఈలాటి పరిస్థితియందు మతధర్మమును వానికి సమర్థత గలంతవఱకే అప్రయత్నముగనే నేర్చుచున్నాడు. మఱియు సంఘజీవనమున నిరంతరము పరిణామములు సాగుచుండును. దీనిని గమనించుటయే చరిత్రపఠన మగును. ఈ తీరున సంఘశాస్త్రము ప్రణావము గాంచుచున్నది.

మొదట బాలుడు సాగించిన వ్యష్టి అవలోకన ఫలితార్థముగ సంఘటిల్లి భాషాప్రకటనము, భావప్రకటనము, క్రియాప్రకటనము అనునవి సాముదాయికముగ జరుగును. ఇందువలన తర్కవాదములు, ఉపన్యాసములు, గ్రంథరచనము, చిత్రకళలు, గానము, సృష్టి పరిశీలన యాత్రలు, తీర్థయాత్రలు, జాతీయోత్సవములు, మత సభలు, పాఠశాలలు, పరపతి సంఘములు, సేవాసంఘములు మొదలగువానిని సాగించు ప్రతిష్ఠాపనలను నిర్మాణము చేయుట ఘటిల్లును. ఇవన్నియు సాపేక్షిక కియలు. (Relative activities)

ఈ తెఱగున బాలుని అవలోకనమువలన పోను పోను వ్యష్టిగతముగను సమష్టిని కూడ కలుగగల ఫలితార్థముల దెలిపితిమి. ఈ అవలోకన పర్యవసానముగా ఆహారము, వస్త్రధారణము, నివాసము సమకూర్చుకొను ప్రక్రియలు సాగకతీరవు. ఉత్ఫలితార్థముగ వ్యవసాయము, వడ్రము, నేతపని, కమ్మరము మున్నగు వృత్తులు బయలుదేరును. మఱల ఈ వృత్తులు కొనసాగుటకగు ఉపకరణ నిర్మాణావశ్యకత వలనను కమ్మరము, వడ్రము, శిల్పము ప్రవర్ధనము గాంచగలవు.

ఇవంతయు నరజీవన వికాసమునకు సహజసిద్ధమగు ప్రేరణచేత నేర్పడినదియే. దీనిని సక్రమముగ నడుపుటకై అవసరమగు విజ్ఞానమును, కర్మకౌశలమును, కల్పనాదక్షతను నేర్పునదియే సద్విద్య. తదితరమగున దెల్ల అవిద్యయే యనదగును. ఆ పటము వలన సూచితములగు విషయములను మిక్కిలి స్పష్టముగ నిందు వివరించితిమి.

ఈ పీఠికలోని యంశములు ప్రత్యేకము ఒక గ్రంథముగ రచింపబడదగినంత విశాలమైనవి. గ్రంథవిస్తరణభీతిచేత సంక్షిప్తముగ పేర్కొనబడి యున్నవి. సిద్ధాంత విచారణ సలుపువారికి ఈ మాత్రము చాలును. ఆచరణ రూపమున పరిశోధనలు చేయు ఉపాధ్యాయులు ఈ సూచనలను గమనించి గ్రంథమందలి పాఠ్యాంశక్రమమును సవిమర్శకముగ జరుపుచో విషయములు తెల్లము కాగలవు.

గ్రంథకర్త

# పూర్వ విధానము

## ప్రథమపాదము

—·—

### సిద్ధాంతదర్శనము

...

### ప్రకృతిలో నరుని స్థానము : పాశ్చాత్యుల భావము

నరునందలి శక్తుల నన్నింటిని వెలికి దీయుటయే విద్యాభ్యాసమని ఒక పాశ్చాత్య పండితుడు నుడివియున్నాడు. అనగా నరునందు గల సమస్త శక్తులను పరిపక్వ దశకు దీసికొని వచ్చుట వారి ఆశయము. ఎందులకు? భగవంతుడు ఈ ప్రపంచమును ఆఱు దినములలో సృజియించి, తుదిని మానవుని సృష్టిచేసి, "ఈ ప్రపంచమున కంతటికి నిన్ను ప్రభునిగ జేయుచున్నాను. ఇది నీ భోగముకొఱకేర్పడినది" అని వానితో చెప్పెనట. ఈ జగత్తు భోగ్యక్షేత్రము, జీవులకు భోగమే గమ్యము. అందుకొఱకై పరస్పరము హింసించుకొనుటయు, స్పర్ధలు సలుపుటయు సహజప్రవృత్తి యని పాశ్చాత్యు లర్థము చెప్పుచున్నారు. ఏ జీవి బలాఢ్యమై తోడివానితో పోరాడి జయింపగలదో అదియే బ్రతుకుటకు అర్హమైనది. నీటిలోని నలుసుల బోలు చిన్ని పురుగులను చిఱు చేపలు పట్టి తినుచున్నవి. చిఱు చేపలు పెద్ద చేపలకు ఆహార మగుచున్నవి. పెద్ద చేపలు తిమింగిలములు మొదలగు వానికి స్వాభావికపు తిండి యగుచున్నవి. వాని నన్నిటిని జంపుకొని తిను నరుడు మహాఘనుడు. నరసంఘములనెల్ల నిర్జింప జాలువాడు నరాధిపుడు.

సూక్ష్మజీవిని దోమ, దోమను ఈగ, ఈగను బల్లి, బల్లిని పిల్లి, పిల్లిని పులి, పులిని పురుషుడు, పురుషుని పురుషాగ్రణి హతముచేయుట పాశ్చాత్యులు కనిపెట్టిన ప్రకృతి సిద్ధమార్గము. "వీర భోజ్యము సుమ్ము రాజ్యము" అను సూత్రము ననుసరించి, దుర్బలురపై దాడి వెడలి, వారిని ఓడించి, వారి సంపదలను హరించి, సామ్రాజ్యాలను నిర్మాణము చేయుట పరమ పురుషార్థము. పాశ్చాత్యుల

సంఘజీవనము, వ్యాపారనీతి, రాజ్యతంత్రము, అన్నియు ఈ సూత్రమునే సూచించు చున్నవి. ఆ సూత్రమే భారతజాతి విద్యావిధానమునకు పునాదిగా పాలకులచే నిర్ణయింపబడినది. అది మన జాతీయ సత్వమునకు సరిపడని దగుటచేత ముప్పు వాటిల్లుచున్నది.

## భారతీయుల భావము

భారతీయులకును శక్తి ప్రవర్ధనోద్దేశ్యము లేకపోలేదు. చాలగనే యున్నది. కాని దానికి పరమావధి వేఱు :—

'సహ యజ్ఞాః ప్రజా స్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః
అనేన ప్రసవిష్యధ్వ మేషవోఽస్త్విష్టకామధుక్"

తాత్పర్యము:—బ్రహ్మదేవుడు సృష్టికాలమునందు, యజ్ఞములతోసహా ప్రజలను సృష్టిచేసి, ఈ యజ్ఞముచే నుత్పత్తిచేయుడు: ఈ యజ్ఞము మీ కోరిన కోరికల నిచ్చును" అని నుడివెను.

"దేవా న్భావయతాఽనేన తే దేవా భావయంతువః
పరస్పరం భావయంత శ్రేయః పరమవాప్స్యథ"

తా :—మీరు యజ్ఞములచేత దేవతలను సంతోషపెట్టుడు. ఆ దేవతలు మిమ్ము సంతోషపెట్టుదురు. ఇట్లొకరి నొకరు ప్రేమించుకొనువారలై పరమ కల్యాణమును పొందుదురు.

## ప్రపంచము యజ్ఞమయము

ప్రపంచ మంతయు యజ్ఞమయము. ముఖ్యముగా నరుడు ఆ యజ్ఞభావమును గుర్తించి, వర్తింపవలసియున్నాడు. సర్వజీవులందును గల ఈ యజ్ఞభావమును గుర్తించుటయే సర్వాంతర్యామి యైన ప్రేమస్వరూపిని భగవంతుని తెలిసికొనుట. ఇయ్యదియే సత్యాన్వేషణము. ఇక యజ్ఞభావముతో దేవతల నారాధించుట యనగా నేమి? దేవత లనగా జగత్తున జూపట్టు సమస్త శక్తులు నని యర్థము. శారీరిక మానసిక ఆధ్యాత్మిక శక్తు లేయే రూపములందు మనకు గోచరించినను ప్రకృతి యందు ఏయే భౌతికశక్తులు వ్యక్తములైనను అవన్నియు దేవతలే. వీనినే అధిష్ఠానదేవత లని పేర్కొందురు. కావున నరు డేమి చేసినను ఈ దేవతల సాహాయ్యముననే యని గ్రహింపనగు. ఈ దేవతా రూపశక్తులను చక్కగ న్యాయము

దప్పక అలవఱచుకొని యజ్ఞమునకై వినియోగించుటయే వాని ఆరాధనము. అందు మూలమున నపుడు సకల క్షేమములను బడయుననుట తెల్లమేగదా! ఇవియే ఆదేవత లిచ్చు వరప్రసాదములు. ఈ తీరున మానవుని జీవనచర్య లన్నియు యజ్ఞములై వానిని కృతకృత్యుని చేయును. యజ్ఞ మనగా ప్రతిఫలాపేక్ష లేక లోకకల్యాణము కొఱకై చేయు సర్వకార్యములును గ్రాహ్యములే. ఇట్టి జీవితాదర్శముతో మెలగ వలసిన భారతజాతి విజాతి వేషభాషలను, విజాతీయ జీవితాదర్శములను అనుకరిం పుచు దైన్యమున గుందుచుండెను. ఎచ్చో జూచినను హింస తాండవించుచున్నది. మాటలో, నడతలో, తలపులో స్వార్థపరత భోగలాలసత ప్రాముఖ్యత వహించి సహజమగు యజ్ఞభావము నాశమైనదో యన పోటీలు, పోరాటములు పరస్పర దూషణములు మెండైనవి. కావున శ్రీ గాంధిగారు అహింసా సిద్ధాంతమును జీవిత చర్యలందెల్ల అవశ్యాచరణీయముగ వక్కాణింపుచున్నారు. సత్యము, అహింస అను రెండు చక్రములమీద భారతజాతి వ్యవహారముల నన్నిటిని నడుప నిశ్చయించి నారు. సత్యాహింసలనే ప్రాచీనులు వివేక వైరాగ్యము లని పేర్కొనిరి. వివేకము అనగా నిత్యానిత్యవస్తు పరిశోధనచేసి, అనిత్యమగు శరీరాదులు తాను గానని తెలిసికొను తెలివి. తాను ఆత్మస్వరూపినని గ్రహించి వైరాగ్యము పూని, అనగా స్వార్థపరతను వీడి లోకకల్యాణముకొఱకు వ్యవహారముల నన్నిటిని నడుప నిశ్చ యించి నరుడు కృతకృత్యుడు కావలసి యున్నది. ఇయ్యది అహింసా సూత్రము. ఈ ఆదర్శము భారతీయులకేగాక సకల ప్రాచ్యదేశవాసులకును అంగీకారమైనదే. కావుననే శ్రీ గాంధీమహాత్ముని సత్యాహింసా సూత్రద్వయమును హిందువులేగాక మహమ్మదీయులు, క్రైస్తవులు అందఱును హర్షించియున్నారు. ఉన్నభేద మెల్ల, ఈ దినములలో మనమున్న పరిస్థితులలో మన రాజకీయ రంగమునందును మన సాంఘిక వివాదముల మధ్యను ఈ సూత్రములను నిరాఘాటముగ అనుష్ఠింప గలమా అనుటలో గలదు.

పరపాలనమున బడియు, విదేశాచారములకు మరగియు, విదేశ విద్యల ప్రభావ మునకు వశులైయున్న భారతీయులకు ప్రాచీనకాలము నుండియు తమ జాతీయ సహజలక్షణములుగ నుండిన సత్యాహింసలు అసాధ్యములుగ దోచుచున్నవి. ఈ విషమస్థితిని దొలగించుట కొకటే మార్గము గలదు. అది విద్యాసంస్కరణము. విద్యాప్రచారమును జాతీయ స్వభావమున కానుగుణ్యముగ నడుపు టొక్కటే ఉపాయము.

## విద్య - నిర్వచనము

శారీరిక, మానసిక శక్తులనే గాక నరునందలి అధ్యాత్మ తేజస్సును గూడ ప్రకాశమునకు దెచ్చునదే విద్య యని శ్రీ గాంధీజీ ప్రవచించియున్నారు. అందు పరమావధి నరునియెడను భగవంతునియెడను అనురాగముగలిగి సేవచేయుట యని మాన్యశ్రీ విశ్వనాథ దాసుగారు వివరించుచున్నారు. నరునందు అవ్యక్తరూపమున సదా వఱగుచున్న పూర్ణతను ప్రకాశమునకు దెచ్చుటే విద్య యని శ్రీ వివేకానంద స్వాములవారు సెలవిచ్చియున్నారు. నరు డనగా భౌతిక పిండము కాదు. మానసిక సంకల్పరాశియు కాదు. అతడు ఆత్మస్వరూపి, ఆధ్యాత్మిక తేజోమూర్తి. ఎట్టి దశయందైనను వాని సహజస్వభావము మారునది కాదు. నరుని ఆత్మత్వమును అన్ని మతములవారును ఒప్పుకొనియే యున్నారు. అయినను ఆగంతుకముగా అజ్ఞాన పటలములు వచ్చి వానిని ఆవరించినవి. తాను దేహము నను అధ్యాస లేక భ్రాంతి వానిని ఆవహించినది. దీనికి హేతు వేమనెడు విచారణ మనను అగాధమగు తత్వ సిద్ధాంతములలో పడవేయగలదు. ఎటుల తటస్థించిన నేమి? ఆ అజ్ఞాన పటలములు తొలగించు నుపాయముల వెదకికొనుటే కర్తవ్యము. అప్పుడు ఆత్మ తేజము దానంతట నదియే ప్రకాశించును.

నరుడు సహజముగా ప్రేమమయుడు, పరోపకార ప్రియుడు, త్యాగశీలుడు నని చెప్పవచ్చును. స్వభావముచేత ధర్మానురక్తి గలవాడే యైనను అధర్మమునకు పాల్పడు చున్నాడు. ఐనను అధర్మవర్తను లనిపించుకొనుటకు పిన్నలు గాని పెద్దలుగాని ఒడంబడరు. అట్లైన లోకములో ఇంత అధర్మము పెరుగ నేల? ధర్మ ప్రచారము సులభము కాకుండు టెందులకు? కారణము మన నావరించి యున్న రజోగుణమని శ్రీ భగవద్గీత తెలుపుచున్నది. సత్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణముల రాశి యీ ప్రకృతి యని చెప్పుదురు. సర్వ జీవులును ప్రకృతికి అధీనమైయున్నవి. నరుడు సయితము ఈ త్రిగుణముల జిక్కువడి, ఒక్కొక్క తరిని ఒక్కొక్క గుణముచే హెచ్చుగా ప్రేరేపింపబడి కార్యము లొనరింపు చుండును. ఇందు తమోగుణము కేవలము అజ్ఞాన మూలకమైనది. సర్వవిధముల బుద్ధి మాంద్యమును, స్తబ్ధత్వమును, అవివేకమును, నీచస్వార్థమును ప్రేరేపించు చుండును. దీనికి పూర్తిగ వశవగువాడు కేవల మృగావస్థయందున్నా డనదగును. ఇట్టివారు చాల అరుదు. సత్వగుణము అధ్యాత్మ తేజస్సును, పరోపకార ధురీణ

తను. అనహంకారమును, సర్వాత్మత్వమును ప్రజ్వరిల జేయును. కేవల సత్వ గుణ ప్రధానులును నరులలో అరిదిగనే యుందురు. వారు దైవసము లనవల యును. ఇక మిగిలినది రజోగుణము. చంచలత, కార్యపరత, ఆశ, ఆందోళన దీనికి లక్షణములు. ఇది సాధారణముగా సత్వము తోడనో తమస్సు తోడనో కలిసి చరించుచుండును. అటు దైవత్వమునకో ఇటు పశుత్వమునకో నరుని త్రోసికొని పోవుచుండును. ఈ రజోగుణమునకు లోబడి మానవుడు తన కిష్టము లేని కార్యముల నైనను చేయ బలాత్కరింప బడుచుండును. ప్రపంచమందలి అధర్మమున కంతకును ఇయ్యదియే మూలము. నరుని విద్యాశిక్షణమున కంతకును గమ్యము ఈ రజోగుణమును తాను వశము చేసికొని, దానికి తాను వశముగాక తన జీవిత గమ్యార్థమును సాధించుకొను శక్తిని సంపాదించుకొనుటే.

## శిక్షణావశ్యకత

జాతిగాని సంఘముగాని వ్యష్టినరుల సమష్టిసమూహమే గాన ఒకజాతియొక్కగాని సంఘముయొక్కగాని అభ్యుదయము అందలి నరుల వర్తన ననుసరించి యుండును. కావున జాతి యోగ్యమైనదిగ నుండవలయు ననిన అందలి బాల బాలికలకు సవ్యమైన విద్యాశిక్షణ మమరియుండవలయును. సంఘ సౌష్ఠవముగాని, ఆర్థికాభ్యుదయముగాని, పారిశ్రామికాభివృద్ధిగాని, రాజ్యతంత్రముగాని సవ్యముగ సాగిరావలయు నననచో జాతీయ సత్వమున కనుగుణమగు విద్యావిధానము అత్యవసర మనక తప్పదు.

## నేటి చదువులు

బాల బాలికల విద్యాపద్ధతియెడ ఉపేక్ష వహించి, ఏ సంస్కరణకు పూనినను వ్యర్థ ప్రయాసయే. ఏ దోషమును సవరింప దలచినను సాధ్యము కాజాలదు. భారత జాతిని పునరుద్ధరింప కోరునెడల అందుకు బాలబాలికలే మూల బలగములుగను. వారికి శిక్షణ గఱపు ఉపాధ్యాయబృందమే అధిష్ఠాన దైవతములుగను పాటించి వర్తింప వలయును. ఈ మాట మఱచి, విజాతీయ విద్యావిధానమును నెలకొలిపి, అట్టి విద్యాలయములందు తయారైన పంతుళ్ల చేతులలో బడిపిల్లకాయలను శిక్షణకు ఒప్పగించుట చేత పాలకులును, జాతీయ నాయకులును గొప్ప తప్పిదమును చేసినవారైరి. ఇప్పటి మన పాఠశాలలు విద్యా లయములేగాని విద్యాలయములు గావని మనీషా

గ్రణి యొకరు వచించిన పలుకెంతయు సత్యము. మన స్వబుద్ధి నశించినది, సంకల్పశక్తి అడుగంటినది. నిర్మాణకౌశలము శూన్యమైనది.

ఇప్పటి బడులలో, మనబిడ్డలు నేర్చు విద్య సవ్యమైనది గాదు. కేవలము అప సవ్యమైన అభావప్రవృత్తి. దీనింగూర్చి శ్రీ వివేకానంద స్వాములవా రిటుల వచించియున్నారు:—

" .... .... ఈ విద్య పురుషలక్షణములను కూర్చునది కాదు. పూర్ణముగ నిషిద్ధ రూప విజ్ఞానరాశి యనవచ్చును. ఇట్టి నిషేధరూప విజ్ఞానమునుగాని, లేక నిషిద్ధ శిక్షణమునుగాని పడయుటకన్న ఎందుననైన పడి చచ్చుట మేలు పిల్లడు బడికి పోవుచున్నాడు గదా. అతడు నేర్చుకొను మొట్టమొదటి పాఠ మేమి ? వాని తండ్రి బుద్ధిహీను డని ! రెండవ విషయము — వాని తాత వెఱ్ఱివా డని ! మూడవ అంశము — వాని కులగురువు లందఱు మోసగాండ్రని ! నాలుగవ సంగతి — వారి శాస్త్రము లన్నియు వట్టి బూటకము లని ! .... .... ...."

" తుదకు వీరు నేర్చిన దేమిటి ? మన మతము, మన ఆచారములు అన్నియు చెడ్డ వట ! పాశ్చాత్యుల వన్నియు శ్రేష్ఠ మైన వట ! ఇంత నేర్చి బయటపడిన పిమ్మట కూటికైన గతి లేదు! ఈలాటి ఉన్నత విద్య ఉండిన నేమి? ఊడిన నేమి? వీరు ఉద్యోగాలకై దేవురించుచు వ్యర్థముగ తిరుగులాడుట కంటె ఏదో కృషిచేసి ఒక ముద్ద అన్నమును గడించుకో జాలు వృత్తివిద్య యే కొంచెమో నేర్చుకొనుట మేలు."

## సంస్కరణావశ్యకత - వార్ధావిధానము

భారతజాతి నుద్ధరించు కొఱకై తీవ్రప్రయత్నము లనేకము సాగింపబడు చున్నవి. అర్ధశతాబ్దమునకు పైగా ఎన్నియో సంఘ సంస్కరణలు, ఎన్నియో పారిశ్రామి కోద్యమములు, ఎన్నియో వస్తు ప్రదర్శనములు, ఎన్నియో రాజకీయ తంత్రములు, ఎన్నియో విప్లవములు తలచూపినవి. అణగిపోయినవి. చెప్పుకో దగినంత ఫలము లభించి యుండలేదు. పునాదులు శిథిలములై యుండ, గోడల కండలు వేయుటయు, చూరుల సవరించుటయు, కప్పుల మార్చుటయు, పెండెము లకు రంగు లద్దుటయు ఎట్టి ఫలితార్థముల నొసగ గలవు ? స్వదేశ విదేశ ప్రజల చేతను, స్వపక్ష వైరి పక్షముల చేతను భారత జాత్యుద్ధరణ పరాయణుడని పరిగణింప బడుచున్న శ్రీగాంధీజీ రాజకీయ సిద్ధాంతముల నవలంబనముగ గొనినాడు. సాత్విక

విప్లవమును నడపినాడు; నిర్మాణ కార్యక్రమమును నెలకొలిపినాడు. ఖాదీ వ్రత ప్రచారము చేసినాడు; నైతిక బోధల సలిపినాడు. త్యాగుడు మాన్పు జూచినాడు; ఆత్మతత్వమును ప్రబోధించినాడు; అస్పృశ్యతను రూపుమాప యత్నించినాడు; అహింసా సిద్ధాంతమును ప్రవచించినాడు; సాంఘిక దౌర్జన్యముల నణచివేయ నాశించినాడు. ఇవన్నియు ఉత్తమ సాధనములే. అయినను సత్వర ఫలము నొసగ జాల వయ్యెను. పూర్ణముగ నడలిపోయిన ఆర్యధర్మమును పునః ప్రతిష్ఠించుటకు విద్యాలయములను సంస్కరించి, సద్విద్యను ప్రచారము గావించిన గాని సాధ్యము గాదని నిశ్చయించినాడు ఇప్పుడున్న విద్యాలయములను, అందలి గురువులను, విద్యార్థులను ఆశ్రయించినాడు. విద్యాలయములు విదేశ ప్రభువుల చేతులలో నున్నవి. అందలి గురువులును వారి అధీనమున నడుచు వారే. విద్యార్థులా నిషేధ విజ్ఞాన ఘనులుగ నున్నారు. చెలరేగి అల్లరులు చేయుదురేగాని క్రమశిక్షణకు లోబడి నడువలేరు. సంఘమున గల విద్యాధికులు స్వార్థపరులై సమష్టి కార్యములందు సయితము వ్యష్టిలాభముల జూచుకొను దిట్టలైరి. కాబట్టి సరియైన పునాదులమీదనే జాత్యభ్యుదయ సౌధమును నిర్మింప వలసియున్న దని నిశ్చయించిన శ్రీగాంధీజీ నూతన విద్యావిధానమును ప్రతిపాదించినాడు. దానినే వార్ధావిధాన మనుచున్నాము. శేగామ వాసిగా నుండిన శ్రీ గాంధీజీచే ప్రతిపాదింప బడుటచేత దానికి శేగామ విధానమనియు పేరువచ్చినది.

## వార్ధావిధానము అపూర్వమా ?

వార్ధావిద్యావిధానమును నాయకులే క్రొత్తదనుచున్నారు. ఉద్యోగులు బెదటి బెదటి చూచుచున్నారు. విద్యాలయాధికారులు క్రొత్తపెంతపు బట్టవలనె గదా యని విసుగు జూపుచున్నారు. ఎల్లెడలను దీనింగూర్చిన విమర్శనలే! అనుకూలములు కొలదిపాటి. ప్రతికూలములు అనేకములు. విద్యాప్రబోధనా ధురీణులగు వారు సయితము ఈ సిద్ధాంతమును సమగ్రముగ పరిశీలించి ఆమోదమును దెలుప సాహసించుట లేదు. జాతీయ సత్వములగు సహజ ప్రవృత్తులను, మన ప్రాచీన సభ్యతను గమనించు వారికి ఈ వార్ధావిధానము నూతనము కాదని తెలియవచ్చును. ఇది మన పూర్వపు గురుకుల పద్ధతియే సుడీ! పూర్వపు గురుకులములలో వృత్తులు నేర్పు నాచారము గలదా? అని శంకింపకుడు. దీనిని గూర్చి ముందు ముందు విన్నవించెదము. ప్రస్తుతము రాగద్వేషముల బూనక, అభిమాన తిరస్కారములకు మనసున చోటీయ్యక, ఈ వార్ధావిధానము ఎటుల బయలుదేరినదో, దీని

స్వరూప లక్షణము లెయ్యవియో విచారింతముగాక ! ఈ గ్రంథముయొక్క ప్రయోజన మదియే.

చాలకాలము విద్యాప్రచారమున పాల్గొని బాలకృష్ణ సేవల నొనర్చిన వాడనగుటచేతను, ప్రస్తుతము అనుష్ఠానక్షేత్రమున లేకున్నను సిద్ధాంతావలోకానాతత్పరుడనైయే నుండుటచేతను, పలువురు ఉపాధ్యాయ సోదరులు, అందు ముఖ్యముగా ఆంగ్ల హిందీ భాషల పరిచయము లేనివారు, తమ కీ సిద్ధాంత స్వరూపమును ఆంధ్రమున చిత్రించి పెట్టు డని అర్థించుటచేతను, నా యోపినంత సేవచేయ సమకట్టినాడను. ఇక్కార్యమునందు, మదరాసు విద్యాశాఖామాత్యులగు వార్కే మహాశయుని గ్రంథమును, హరిజన పత్రికలోని శ్రీ గాంధీజీ వ్యాసములును, కృష్ణాపత్రికయందలి ప్రకటనలును నాకు చాల నుపకరించినవి. అట్టి సహకారుల కెల్ల నా వందనములు.

## విద్యా సంస్కర్తలు

ఎట్టి సద్ధర్మమైనను కాలగతిని బడి శిథిల మగుచు వచ్చును. అప్పు డప్పుడు మహనీయులు ఉద్భవించి దానిని పునరుద్ధరించు చుందురు. భారత జాతీయ విద్యావిధానమునకు ఆ గతియే పట్టినది. భారతజాతికి విశిష్ట సత్వమును, జీవిత గమ్యమును గలవనుట నెల్లరు మఱచిరి. దానిని పునః స్మరించునటుల చేయు యత్నములు ఎందఱెందఱో సాగించుచునే వచ్చినారు. అనీబిసెంటమ్మ, రమేశ దత్తు, అరవిందఘోషు, బాలగంగాధరతిలకు, గోపాలకృష్ణ గోఖలే, కోపల్లె హనుమంతరాయలు మున్నగువారు జాతీయ విద్యాలయములను కళాశాలలును సంస్థాపించి యున్నారు. ఆధునికమును, స్వార్థప్రేరకమును, స్పర్థామూలకము నగు చదువుల నరికట్ట ప్రయత్నించి యున్నారు. వారిప్రయత్నములు ఏటికి ఎదురీత వంటి వయ్యెను. అటు పాలకులు నడుపు సంస్థలు నిరాఘాటముగ సాగివచ్చుచుండ కొంచెము హెచ్చు తగ్గుగా అదే లక్ష్యమును అంగీకరింపుచు కొంత రాజీమార్గము నవలంబించుటచేత ఈ జాతీయ సంస్థలు క్షీణింప నయ్యెను. పెరవారితో పోటీలు సలుపుటయు, పోరులు గావించి విజయముల బడయుటయు, బలహీనుల నణచివేయుటయు, యువకులను వ్యామోహమున ముంచుచునే యుండెను. స్వార్థత్యాగము, సంఘసేవ, ఆత్మార్పణము మాటలందే నిలిచి పోయెను. కొలది సంవత్సరములలోనే జాతీయ విద్యాలయములు మూసివేయ బడుటో దొరతనమువారి అనుమతిని బడయు రీతిని మారిపోవుటో తటస్థించినది.

## మతము - విద్య

శ్రీ గాంధీజీ మతొకసారి ఆ ప్రయత్నమును లేవనెత్తినాడు. సత్యాన్వేషణ సిద్ధాంతమును అధ్యాత్మదృష్టి నొసగుటకును, అహింసా సిద్ధాంతమును వైరాగ్య వృత్తిని ప్రేరేపించుటకును ప్రయోగింపుచున్నాడు హద్దుమీరి మతమును సాంఘిక విషయములందును, రాజకీయ తంత్రములందును ప్రవేశపెట్టుచున్నాడని పల్వురు విమర్శింపసాగిరి. విదేశపాలకుల రహస్యవ్యూహముల భేదించుటకు సత్యవ్రతము ఆటంకముగ నుండి అపజయము గూర్చుచున్న దనుచున్నారు. ఆత్మభావము వ్యవహారకాండ కుపకరించ దనుచున్నారు. ఇక వైరాగ్యము పట్టి సన్న్యాసులను చేసి వైచి ప్రజలను లౌకిక వ్యవహారమున పనికిమాలిన వారిని గావించుట కుద్దేశింప బడిన దని దూరుచుండిరి. లోకమున ప్రతిమనుజుని, ప్రతికార్యమును దోషదృష్టితో జూచి, దూరముగ పోయి నిలుచుటే వైరాగ్య మని వారి భావన. కాని "వైరాగ్యము రెండు రీతుల నుండును: ప్రయోజనముతో గూడినది, ప్రయోజన శూన్యమైనది. ఈ ప్రయోజన శూన్య మగునది పుచ్చి పురుగులు పట్టిన మెదడు గల వారికి తప్ప ఇతరులకు హితవు కాజాలదు. ప్రయోజనముతో కూడిన వైరాగ్య మన అన్యవిషయముల నుండి మనస్సును మఱలించి, భగవంతునిమీద లేక ఆత్మమీద హత్తించుట యని అర్థము, భగవంతు డనగా ఏ ఒకానొక వ్యష్టిదైవమే కాదు, అతడు సర్వసమష్టి స్వరూపుడు, సర్వజీవులందు వసించు సమష్టి ఆత్మయై, సర్వాధికారియై పఱగు సర్వాంతర్యామి యగు సర్వేశ్వరుడు సుడీ!" అని శ్రీ వివేకానంద స్వాముల వారు నిర్వచించియున్నారు.

## సత్యాహింసలు

శ్రీ గాంధీజీయు సత్య మనగా పరమాత్మ యనియు, ఆత డీ జగమంతయు వ్యాపించిన సర్వాంతర్యామి యగు భగవంతుడే యనియు తెలుపుచున్నాడు. ఆ సర్వేశ్వరుని ప్రత్యక్షము చేసికొనుటయే వారు బోధించు సత్యాన్వేషణమునకు పరమావధి. ఈ సత్యాన్వేషణము సర్వజీవులను ఆత్మ సమానముగ ప్రేమించి సేవ లొనర్చుట మూలమున సాగవలసియున్నది. సర్వజీవ సేవయే భగవత్సేవ. ప్రతి మానవుడును తన శక్తిసామర్థ్యము లున్నంతవఱకు ఈ అన్వేషణమును చేయవలసి యున్నది. సర్వాంతర్యామి భగవంతుని సేవించునతడు ఏ వారికిని హింస చేయబోవడు. శ్రీ గాంధీజీ 'అహింస సర్వజీవుల యెడలను, మనను శత్రువులుగ భావించు వారియెడలను సయితము ఆచరణ యోగ్యమై యొప్ప వలసి

యున్నది. స్వార్థములు దీనికి హద్దులు పెట్టజాలవు. దీనివలన నరుని హృదయము పవిత్రమగును. పవిత్ర హృదయులకు భగవంతుడు ప్రత్యక్ష మగును' అని తెల్పుచున్నాడు. కావున సత్యాఽహింస లను రెండు చక్రములపైని విద్యా ప్రచారమును సాగించు విధానముగ, వార్ధావిధానము బయలుదేరదీసినాడు. ఇందు పారమార్థిక, వ్యావహారిక జీవితముల రెంటికిని సఖ్యత కూర్చబడి యున్నది. తీర్థము ప్రసాదము రెండును కలిసి వచ్చును. సత్యాన్వేషణము వలన ముక్తి, అహింసాత్మకమగు సేవ వలన భుక్తి లభింపగలవు. ఇందు గల ఆత్మబోధ శుష్కవేదాంతము గాదు. లౌకిక జీవనమునకు వెలిజేయు సర్వవిసర్జన యోగముకాదు. వ్యాపార స్థానములందును పరిశ్రమాలయములందును వినోదశాలలందును సాంసారిక గృహములందును ఆచరణయోగ్యమై పఱగు జీవితోపాయము. ఇయ్యది మన ప్రాచీన ఋషి సత్తములు బోధించినదియే. మన పురాణ గురుకులములందు అనుష్ఠింపబడి యున్నదే. కాలగతిని శిథిలమై మఱుపున బడిపోయినది. ఇప్పుడు పునరుద్ధరింపబడి దేశ కాల పరిస్థితుల కనురూపముగా సవరింపబడి నవీన వార్ధా విధానముగా అవతరించినది. కొంచెము భాషా భేదముతో అన్ని మతముల వారికిని హితవగు మార్గమే యిది. ఇయ్యది వార్ధా సభలో ప్రతిపాదింపబడుటచేత వార్ధావిధానము ను పేర వ్యవహరింపబడుచున్నది.

## సిద్ధాంత దర్శనము

1937 వ సం॥ అక్టోబరు 22, 23 తేదీలలో వార్ధానగరమునందు మహాత్ముని అధ్యక్షతను విద్యాసభ జరిగినది కాంగ్రెసురాష్ట్రి విద్యామంత్రులాదిగా పెక్కురు విద్యాభిమానులు సభకు విచ్చేసి చర్చలలో పాల్గొనిరి. మహాత్ముడు సూచించిన వృత్తివిద్యాపూర్వకమైన ప్రాథమిక విద్యాపద్ధతిని సభవారామోదించి, అందులకు తగిన ప్రణాళికను సిద్ధముచేయుటకు డాక్టరు జాకీరు హుస్సేనుగారి అధిపత్యమున నొక కమిటీని నియమించిరి. మహాత్ము డా సభలో నీ క్రింది విధముగా తన సూచనలను స్పష్టీకరించెను.

## విద్యాసభ - శ్రీ గాంధీజీ ఉపన్యాసము

ప్రస్తుత విద్యావిధానము దేశమున కేమాత్రము ఉపయోగముగ నుండుట లేదు. ఉన్నతతరగతులలో సకలవిషయములు ఇంగ్లీషుద్వారా బోధింపబడు చుండుటవలన స్వల్పసంఖ్యాకులైన విద్యాధికులకును బహుళసంఖ్యాకులైన జనసామాన్యమున

కును మధ్య పెద్ద అఘాత మేర్పడిపోయినది. జనసామాన్యములో విద్య వ్యాపించుట కిది ప్రతిబంధక మయ్యెను. ఆంగ్లమున కీవిధమైన విశేషప్రాముఖ్య మీయబడుటవలన విద్యాధికులు జీవితాచరణమునందు కుంటివారై పోయి తమ దేశమునకు తామే దూరస్థులైరి. వృత్తివిద్యా శిక్షణ మేమియు లేక పోవుటవలన ఫలదాయక మగు నీకృషిని చేయ లేక, శారీరికముగాకూడ బలహీను లగుట తటస్థించినది.

ప్రాథమిక విద్యకై ప్రస్తుతము ఖర్చుపెట్టబడుచున్న సొమ్ము కేవలము వ్యర్థ మని చెప్పక తప్పదు. నేర్చినదైనను ఇటు జనపద జీవనమునకుగాని అటు నగర జీవనమునకుగాని పనికిరాదు. ప్రస్తుత విద్యావిధానమువలన నేదైన ఫలిత ముండిన అయ్యది ఎవ రిచ్చు పన్నులవలన ప్రభుత్వకోశము ఎక్కువగ నిండుచున్నదో అట్టి వారి కెంతమాత్రము ముట్టుట లేదు. ఏలయన, వారి సంతానము ఈ విద్యాప్రయోజన మేమాత్రము పొందుటలే దని యే చెప్పదగును.

ప్రాథమిక విద్యాసంస్కరణను ఈ క్రింది విధముగా చేయవలెనని నాకు తోచుచున్నది. ఈ విద్య ఏడుసంవత్సరములలో పూర్తియగునదిగ నుండవలెను. ఇంగ్లీషును మినహాయించిన మెట్రిక్యులేషను విజ్ఞాన మీ ఏడుసంవత్సరములలోను బాలుర కేర్పడునట్లుగ నుండవలెను. పైగా, జీవనమున కాధారము గల్పించు నేదైన వృత్తివిద్యయందు విద్యార్థి సమర్థుడై యుండునట్లు చేయవలెను.

## వృత్తిద్వారా విద్య

బాలబాలికల సర్వతోముఖాభివృద్ధికి గాను వారి కిచ్చు శిక్షణమంతయు సాధ్యమైనంతవరకు ఏదైన లాభదాయకమగు వృత్తివిద్యాబోధద్వారానే ఇయ్యవలెను. అనగా, ఈ పద్ధతిద్వారా రెండు కార్యములు సాధింపబడవలసియున్నవి. (1) వృత్తి విద్యచే ఆ యా వస్తువులు తయారుచేసి తద్వారా విద్యార్థి తన శిక్షణ కగు ఖర్చును తానే భరించుకొనగల్గుట (2) ఆ వృత్తి విద్యద్వారానే విద్యార్థి శారీరిక, మానసిక, ఆధ్యాత్మికోన్నతిని పొందగల్గుట. విద్యార్థులు తయారు చేసిన వస్తువుల అమ్మకముద్వారా పాఠశాలకు గావలసిన నివేశన స్థలము, భవనము, సామగ్రి— ఇవన్నియుగూడ సంపాదింప బడవలె నని కాదు నా యభిప్రాయము. ఆ ఖర్చు లిందులో చేరవు.

ప్రత్తి, ఉన్ని, పట్టు పరిశ్రమలు (వడుకు పని, నేతపని, కలంకారిపని మొదలగునవన్నియు ఇందులో చేరును), కుట్టుపని, బైండింగుపని, ఆట వస్తువులు

తయారుచేయుపని, బెల్లపు వంటపని, ఇవన్నియు సులభముగా నేర్చుకొన దగినవి. ఎక్కువ పెట్టుబడి అవసరము లేకయే సాగింపదగినవి.

వృత్తిని నేర్చుటద్వారా విద్యాబోధ చేయుపద్ధతియందు నాకు కొంత అనుభవమున్నది. దక్షిణాఫ్రికాలో టాల్‌స్టాయి ఫారమునందు నా కుమారులకును ఇతరులకును మొదట నేను కాలెన్‌బాచిగారివద్ద నేర్చుకొనిన వడ్రంగము, చెప్పులు కుట్టు పని మున్నగువానిని నేర్పుచు తద్ద్వారా వారికి విద్యాబోధ చేసెడివాడను. ఇందువలన వారు చెడిపోయినదేమియు లేదని నేను గట్టిగా చెప్పగలను. కాని, నాకు తీరిక చాల తక్కువగ నుండిన కారణమునను అనేకమైన ఇతర కార్యములయందు దృష్టి నిగుడ్చవలసినవాడ నగుటచేతను ఆ చేసిన విద్యాబోధ నాకుగాని వారికిగాని తృప్తికరముగ లేకపోయినది.

కేవలము వృత్తులు నేర్చుకొనుటేకాదు—వృత్తులు నేర్చుకొనుటద్వారా విజ్ఞానమును బడయుట—ఇది నా ఆశయము. సమస్తమైన విజ్ఞానము—సారస్వతము, దేశచరిత్ర, భూగోళము, గణితశాస్త్రము, భౌతికశాస్త్రము మొదలగున వన్నియు—వృత్తివిద్యలద్వారానే నేర్పబడవలయును. మధ్యయుగములో ఇదేకదా విద్యాపద్ధతి యని కొంద రాక్షేపించవచ్చును. కాదు. అప్పుడు వృత్తివిద్యాశిక్షణము ప్రధానముగ నున్నను తద్ద్వారా సకల విజ్ఞానమును బోధించు పద్ధతి లేదు.

తకిలీమీద నూలువడుకు పనిని నేర్పవలసియున్న దనుకొనుడు. ప్రత్తిలో ఎన్నెన్ని రకము లున్నవో, ఏ యే రాష్ట్రములయందు ఏ యే నెలలలో ఏ యే రకములు పండునో, వడుకు పరిశ్రమ మన దేశములో ఏ విధముగా క్షీణగతికి వచ్చినదో — ఈ సందర్భమున ఇండియాలో బ్రిటిషు పరిపాలనయొక్క చరిత్రకూడ వచ్చును— అసు పోయుట వగైరాలలో లెక్క లెట్లుండవలెనో, ఎందుకుండవలెనో—ఇవన్నియు బాలురకు బోధింపవలసి యుండును. నా మనుమని కిప్పుడు ఈ విధమైన శిక్షణ నిచ్చుచున్నాను. శిక్షణ పొందుచున్నట్లే వానికి తెలియదు. ఆడుచు పాడుచు గంతులు వేయుచునే ఈ విషయముల నన్నింటి నేర్చుకొనుచున్నాడు.

## ఉపాధ్యాయుల జీతములు

విద్యార్థులు చేసిన చేతిపనుల మూలమున ఉపాధ్యాయుని కగు ఖర్చును రాబట్టవలె నని నా కోరిక. ఏలయన, కోట్లకొలదిగ నున్న మన బాలురకు విద్య నేర్పుట కంతకంటె వేఱు మార్గము లేదు. వైస్రాయి మిలిటరీఖర్చు తగ్గించువరకును

ఇతరత్రా మన కధికారాయము వచ్చువరకును మనము వేచియుండజాలము. నేను సూచించిన ప్రాథమిక విద్యా విధానములో "గ్రామ పారిశుద్ధ్య మెట్లుండ వలెను? ఆరోగ్యము నెట్లు కాపాడుకొన వలెను? ఏది పుష్టికర మైన యాహార మగును? ఇతరులపై నాధారపడక తనకు తాను కృషి సల్పుట యెట్లు? గృహములో తల్లిదండ్రులకు వారి వారి పనులలో తోడ్పడుట యెట్లు" మొదలగున వన్నియు వచ్చును. ఇప్పటి పిల్లవాండ్ర యందు శుభ్రత, స్వయంసహాయము, దేహదార్ఢ్యము శూన్యములు. చిన్న చిన్న నాట్య విధానముల ద్వారా బాలురకు తగిన వ్యాయామ శిక్షణ మొసగవచ్చును.

సాహిత్య విద్యాభ్యాసమునకు నేను ప్రతికూలుడ నని కొందఱు అపోహ పడు చున్నారు. అది యెంత మాత్రము నిజము కాదు. ఆ సాహిత్య విద్య ఏ "రీతి" గా అభ్యసింపవలెనో మాత్రమే నేను చెప్పితిని. పిల్లలను కష్టపెట్టి వారి చేత పనులు చేయించుట అధర్మము కాదా యని కొందఱనిరి. పిల్లలచే పనులు చేయించుట వలన చాల సొమ్ము పాడుపోవు నని కూడ అధిక్షేపించిరి. ఈ మాట సత్యము కాదని అనుభవ మున్నవారికి తెలియును. తక్లీ వంటి క్రీడావస్తువులతో పిల్లలచే పనిచేయించుట వారిని కష్టపెట్టుట యగునా? ఇండ్లలో పిల్లలు తమ తల్లిదండ్రులకు వారి వారి పనుల యందు తోడ్పడుచుండుట లేదా? నేను చెప్పిన విధానమునందు పిల్లవాడు తన తల్లిదండ్రులకే గాక గ్రామము నెడ, దేశము నెడ తనకు గల బాధ్యతను గుర్తెఱుగుట నేర్చుకొన గలడు.

ఈ నూతన విధానము హిందువులకు, మహమ్మదీయులకు, పార్శీలకు, క్రైస్తవులకు—అందరకు సమానము. మతమును గూర్చిన బోధ విషయమై నే నెక్కువగ మాటాడలేదేమని కొందఱనిరి. తనకు తాను సహాయపడ నేర్చుకొనవలెననే మతము—ఆచరణ రూపక మైన మతము—ఈ విధానములో బోధింపబడుచునే యున్నది గదా!

బాలురు తయారు చేసిన వస్తువులను సరియైన ధరలకు కొనియు, వారి శిక్షణ పూర్తియైన తర్వాత వారికి పనులు చూపించియు వారికి ప్రభుత్వము సర్వ విధముల తోడ్పడవలసిన విధి కలదు.

ఈ విద్యావిధాన నిర్వహణమునకై అధ్యాపకులను సంపాదించుటకు ప్రొఫెసరు కె. టి. షా గారు నిర్బంధ సేవా విధానమును సూచించిరి. ఇది బానిసత్వము క్రిందకు చేరదాయని కొందరి యధిక్షేపము. కాని యువకులు జీవిత రంగములో ప్రవే

శించుటకు ముందు ఏడాదో రెండేండ్లో నిర్బంధముగ దేశసేవ యొనర్చుట దానిసత్ఫముగా భావింప తగును. కడచిన 17 ఏండ్ల నుండియు యువకు లనేకులు అనేకవిధములుగా త్యాగము చూపిరి. ఈ విధమైన దేశసేవ వారు సంతోష పూర్వకముగ చేయుదు రనియే నా నమ్మకము,

## అహింసా పద్ధతి

మనలో సాంఘిక కలహములు గలవు. ఇవి కేవలము మన యోగముననే వ్రాసి పెట్టినవి కావు. వెనుక ఇంగ్లండులో కూడ అంతఃకలహములు చెలరేగెను. ఇప్పుడు ఇంపీరియలిజము లోకమునకు శత్రువైయున్నది. మనము సాంఘిక కలహములను రూపుమాప వలె నన్న నేను చెప్పిన విద్యాపద్ధతి ద్వారామన పిల్లలకు బోధ చేయించి రాబోయే తరమునకు మంచి పునాది వేయవలసి యున్నది. అహింసాత్మక మైన పద్ధతి యిది. రివిన్యూ నష్ట మేమియు లేక, ప్రభుత్వ కోశములు పూర్తిగా నిండి యున్నను గూడ ఈ స్వయంపోషక విద్యాపద్ధతియే అవలంబించ తగినది. మన సభ్యతకు, మన నాగరికతకు, మన జాతియొక్క నిజమైన ధర్మము మన బాలురను ప్రతినిధులనుగా నొనర్చవలసియున్నది. యూరపు మనకు ఆదర్శము కాదు. దాని పద్ధతులన్నియు హింసాత్మకములు. రష్యా పెక్కు ఘనకార్యముల సాధించినమాట వాస్తవమే. కాని, దాని విధానమంతయు కేవలము హింస దౌర్జన్యముల మీదనే ఆధారపడియున్నది, మన భారతదేశము హింసను వర్జింప వలసియున్న యెడల నేను చెప్పిన విద్యాపద్ధతియొక్క నియమము అనుష్ఠింప బడవలెను, విద్యకొఱకు ఇంగ్లండు కోట్లు ఖర్చుపెట్టుచున్నదని, అమెరికా కూడ అట్లే వ్యయపరచు చున్న దని చెప్పుదురు, కాని ఆ ధనమంతయు ఒకరిని కొట్టి సంపాదించిన దని మరచిపోగూడదు. పరపీడనమునకు వారొక శాస్త్రమును తయారు చేసిరి. ఆ కారణమున వారి బాలుర విద్యకు వారు కోట్లకొలది ఖర్చు పెట్టగల్గు చున్నారు. పరపీడనపద్ధతి మనకు గ్రాహ్యము కాదు. కావున అహింసాత్మకమైన ఈ స్వయంపోషక విద్యాపద్ధతి తప్ప మనకు స్వీకరింపతగినది మరియొకటి లేదు.

# ద్వితీయ పాదము

## స్వరూప దర్శనము

వార్ధావిద్యాసభయందు శ్రీ గాంధీజీ ఉపన్యసించిన పిమ్మట పలువురు విద్యాశాఖ యందు పనిచేసి గొప్ప యనుభవమును గణించినవారు తమ తమ అభిప్రాయము లను తెలిపియున్నారు. తుదిని ఈ క్రింది నాలుగు తీర్మానములు సభవారిచే నంగీక రింపబడినవి.

### విద్యాసభవారి నాలుగు తీర్మానములు

1. ఏడు సంవత్సరముల ఉచిత నిర్బంధ విద్యను యావద్భారత జాతికిని సమ కూర్పవలయునని ఈ సభవారు అభిప్రాయపడుచున్నారు.

2. బోధనయందుపయోగించు భాష మాతృభాషగా నుండవలయును.

3. ఈ ఏడేండ్లు నేర్పబడు విద్య సంపాదనకు వీలగునట్టి ఏదేని చేతిపనిని యాధారము చేసికొని సాగింపవలయును. విద్యార్థులందు వికాసమునకు దేబడు ఇతర శక్తులను, వారి కొసగబడు శిక్షణమును సాధ్యమగునంతవరకు ఆ నిర్ణీతమైన ప్రధానహస్త పరిశ్రమకు సంబంధపడియుండవలెను. అని శ్రీ గాంధిమహాత్ముడు చేసిన ప్రతిపాదనను ఈ సభవా రామోదించు చున్నారు.

4. ఈ విద్యావిధానమువలన ఉపాధ్యాయుల జీతమునకు క్రమేణా సంపాదింప వీలగునని ఈ సభవా రాశించుచున్నారు.

ఈ తీర్మానముల ననుసరించి పాఠ్యక్రమమును నిర్ణయించి యొక నివేదికను సిద్ధముచేయుటకై డాక్టరు జాకీరు హూస్సేనుగారి అధిపత్యము క్రింద పదిమంది ప్రవీ ణులతో ఒక కమిటీ ఏర్పాటు చేయబడినది. దానికి శ్రీయుత ఆర్యనాయకంగారు కార్యదర్శి. క్వాజాగులాం సయదీన్, వినోబా, కాకాకలేల్కారు, కిషోరులాల్, మష్రువాలా, జె. సి. కుమారప్పన్., శ్రీకృష్ణదాసు జాజు, ప్రొఫెసర్ కె. టి.షా., శ్రీమతి ఆశాదేవిగారలు సభ్యులు.

### జాకీరు కమిటీ రిపోర్టు

వీరు తమ నివేదికను 1937వ సం॥ డిశంబరులో శ్రీ గాంధీమహాత్మునకు సమ ర్పించిరి. దీనికి జాకీరు హూస్సేనుకమిటీ రిపోర్టు అనిపేరు. అందీ క్రింది యంశ ములు ఉపోద్ఘాతముగా దెలుప బడినవి.

## ప్రస్తుత విద్య

ప్రస్తుత సమయమం దున్న విద్యావిధాన పద్ధతిని దేశీయు లందరును ఖండించియే యున్నారు. ఇంతవర కున్న విధానము జాతీయావసరములను గుర్తించుట యందు గాని, జాతీయ శక్తులను ప్రేరేపించి వానిని సరియైన మార్గముల నడుపుటలో గాని ఫలప్రదము కాలేదు. నేడు జాతీయ అంతర్జాతీయ వ్యవహారములు అత్యద్భుత పరివర్తనము నొంది కాబోవు పౌరులు వాటి నన్నిటి యందును సుశిక్షితులు కావలసి యుండ ప్రస్తుత విద్యావిధానము వాస్తవ జీవితరంగమునకు దూరమై మార్పుల కనుగుణముగా పరివర్తన మొంద జాలక యథాప్రకారము సాగుచున్నది. ఇందు కాలమున కక్కరకు వచ్చు లాభములు గాని నూతన సృష్టికి ఆకర మగు అవకాశములు గాని లేవు. ఈ పద్ధతి యందు వ్యక్తులు తమ కాళ్ళపై తాము నిలువబడి సంఘమునకు ప్రయోజనకారు లగు పౌరులుగా నుండ సంఘోద్ధరణకు తోడ్పడుటకు తగిన శిక్షణ లేదు. ప్రస్తుతము రాజ్యము చేయుచున్న దుర్బల జాతుల దోపిడి హింస స్పర్ధ— వీనిని తొలగించి వాని స్థానే విద్య వలన కలుగ వలసిన నూతన సహకార జీవనము కలిగించుటకు సైత మీ పద్ధతి యుపయోగించకున్నది. అందువలన దేశము నలువైపుల నుండియు నీ విధానమును తొలగించి దాని బదులు జాతీయావసరములకు తగినట్టియు ప్రస్తుతము దేశములో నేర్పడిన సమస్యలను తీర్పజాలు నట్టియు విధాన మేర్పడ వలె నని దేశీయులు ఘోషించుచున్నారు.

ఈ దేశపు బిడ్డల కొఱకు ఏర్పరచు ఏ విద్యావిధాన మైనను కొన్ని విధముల పాశ్చాత్య విధానము కంటె భిన్నముగా నుండగలదు. ఇందులకు ముఖ్య కారణము ఆ దేశములందు వలె గాక మన జాతి శాంతి మార్గముగ నహింసను వరించి యుండుటచే మన పసిపాపలకు ప్రారంభము నుండియు పశుబలము కంటె నహింస యెటుల శ్రేష్ఠమైనదియు బోధించవలసి యున్నది.

## మహాత్మాజీ నాయకత్వము

ప్రస్తుత విద్యావిధానము క్లిష్టస్థితిలోనున్న యీసమయమున దీర్ఘదర్శియగు మహాత్మాజీ రంగమున ప్రవేశించి నాయకత్వము వహించి సాకల్యముగ నీ సమస్యను పరిశీలించి దేశీయుల మానసిక ప్రవృత్తికిని అవసరములకును తగినట్టియు, అతిశీఘ్ర కాలమున దేశమునుండి యవిద్యను పారద్రోలునట్టియు విధానమును సూచించియుండెను. ఆయన హరిజన పత్రికలోను వార్ధా విద్యా విషయ సభలోను వెలువరచిన

వానినిబట్టి యీ విధానముయొక్క మూలసూత్రము ప్రతిస్కూలునందును వృత్తి విద్యలను ప్రవేశపెట్టవలెనని, వాని ద్వారానే విద్య బోధించవలెనని, వృత్తి విద్యయే మిగతా బోధలన్నిటికిని మూలకందమై యుండవలెనని, యీ వృత్తివిద్యలను పూర్తిగను సమర్థతతోను సాగించునెడల ఉపాధ్యాయుల జీతములను భరింప వీలగునని, యీ విధానమువలన ప్రభుత్వమువారు తత్క్షణమే కోట్లకొలది జనులలో నిర్బంధ ప్రారంభోచిత విద్యను ప్రవేశపెట్ట సాధ్యమగునని యై యున్నది. ఈ పద్ధతి మినహా ప్రస్తుత మీ దేశమునయున్న ఆర్థిక, రాజకీయ పరిస్థితులలో కోట్లకొలది జనుల నిరక్షరాస్యతను బాపుటకు విపరీత వ్యయముతో కూడిన యితరపద్ధతులెంత మాత్రము నుపయోగింపవు.

## పరిశ్రమలద్వారా విద్యాబోధ

ఉపయుక్తమగు ఏదేని యొక పరిశ్రమద్వారా విద్య నేర్పదగునని యీ కాలపు విద్యావేత్తలందరును అంగీకరించియే యున్నారు. విద్య సర్వతోముఖాభివృద్ధినొందుటకు ఈపద్ధతి శ్రేష్ఠమైనదనికూడ అంగీకరించబడినది.

శిశువులయొక్క మానసిక శక్తులకే ఎల్లప్పుడును పనియిచ్చుచు అనుక్షణము తిరుగుబాటుచేయువారి అంగములకు పనియీయని ప్రస్తుతపు కేవలవిద్యాబోధ నుండి యీ నూతన పద్ధతి వారిని ముక్తులజేయును. ఈవిధానమువల్ల శారీరిక మానసిక శక్తులకు సమానమైన పని గలిగి రెండును సమానముగ నభివృద్ధి నొందగలవు. ఇందువలన బాలబాలికలు కేవలము ఇప్పటివలె చదువుట వ్రాయుట మాత్రమే గాక నిర్మాణాత్మకమైన కృషికి ముఖ్యమైన తమ కాలుసేతులను, తెలివితేటలను వినియోగింపగలరు. దీనిని వ్యక్తియొక్క సర్వతోముఖమైన విద్యయని పిలువదగునని మనవిచేయుచున్నాము.

సాంఘికదృష్టితో చూచినను జాతికి చెందిన అన్నితెగల, వర్ణముల విద్యార్థులును విద్యతోబాటు ఏదేని యొక పరిశ్రమ నేర్చుకొనుటవలన ప్రస్తుతము దేశములో ననర్థములకు కారణమైయున్న "పనిపాటలు చేయువారు తక్కువ, బుద్ధిబలము చేతను డిగ్రీలచేతను జీవించువా రెక్కువ" యను విభేదమును తొలగించుటచే ఈవిధానము మాననీయమగుచున్నది. వృత్తులయొక్క గౌరవమును, అన్యోన్యసాహచర్యము వలని లాభనష్టములను ఈపద్ధతి సర్వోత్కృష్టముగా నిరూపించును. ఇందువలన మానసికముగాను, నైతికముగాను కలుగు పరివర్తనములు అపూర్వముగా నుండును.

ఆర్థికదృష్టితో విచారించినను సమష్టితతోను చాకచక్యముతోను సాగించినచో నీ ప్రణాళిక మన ప్రచారకుల నిర్మాణశక్తులను పెంపొందించు ననియు, వారి విరామ సమయమును లాభదాయకముగా నుపయోగించుకొన దోడ్పడుననియు గ్రహించగలము.

కేవల విద్యాదృష్టితో పరిశీలించినను విద్యకు పరిశ్రమను ఆధారముగా నొనర్చుటవలన విద్యార్థుల జ్ఞానసముపార్జనమునకు వాస్తవికత యేర్పడునని, వారిబుద్ధి వికసించునని, యిందువలన జ్ఞానము జీవితమునకు తోడ్పడునదై వివిధవిజ్ఞాన కార్మికశాఖలకు అన్యోన్యసాహచర్య మేర్పడునని మనము గ్రహించగలము.

## రెండు ముఖ్యవిషయములు

పైని పేర్కొనిన లాభముల నందుటకుగాను రెండుముఖ్యవిషయము లగత్యములు. మొదటిది, విద్యాలయములందు మనము ప్రవేశపెట్టబోవు వృత్తివిద్య విద్యావిషయికముగా తోడ్పడునదై యుండవలెను; మరియు నది హెచ్చుమందికి పనియీయ గలుగునదై పెక్కురకు ఉపయోగించునదిగాను విద్యాకాలమంతటిలోను ఒకటే బోధింపతగినదిగాను ఉండవలెను. మా నివేదికయందు వేరొకచోట యేర్పరచబోవు వృత్తివిద్యలను నిర్ణయించుటలో ప్రత్యేకశ్రద్ధ యవసరమని తెలిపియుంటిమి. ఈ విధానము నాచరణయం దుంచగోరు వా రీవిషయమును ముఖ్యముగా గుర్తించగోరెదము. ఈ విధానోద్దేశ్యము విద్యార్థులను ఏదేని వృత్తియందు యంత్రములమాదిరిగ తర్ఫీదుచేయుటగాక ఆ వృత్తియందలి యవకాశములను విద్యావిషయికదృష్టితో పరిశీలించి బుద్ధివృద్ధిచేయుటకైయున్నది. అందువలన స్కూలునందలి వృత్తివిద్యాబోధనము కేవల మొకతరగతిగా నుండుటేగాక మిగత విషయము లన్నిటిని బోధించుటలో నైతము నూతన దృక్పథమును కొనితెచ్చునదై యున్నది. ఇక రెండవది, సాముదాయిక యత్నము. కృషినిగూర్చియు బాధ్యతను వహించి చాకచక్యముతో పనిచేయవలసిన యావశ్యకతనుగూర్చియు శ్రద్ధ వహించవలెను. మహాత్మాజీ తెలిపినటుల ప్రతివృత్తివిద్యయు నేటివలె కేవలము యంత్రకృషవలెగాక శాస్త్రరీత్యా బోధించబడవలెను. ప్రతివిద్యార్థియు తాను చేయు ప్రతిపనిని ఏల చేయవలసినదియు ఎటుల చేయునదియు నేర్చుకొనవలెను. ఇది పరిశీలనవల్లను అనుభవమువల్లను కలుగగలదు. దృక్పథమునందలి యీ ప్రధాన సూత్రమును గమనింపక ప్రస్తుత విద్యావిధానమునకు నామమాత్రముగా వడుకుట, నేయుట, లేక వడ్రంగము చేర్చుటవల్ల ఈ విధానముయొక్క ఆదర్శము, పటిమ నశించునని ఒత్తిచెప్పగోరెదము.

## ఉత్తమ పౌరధర్మములు

ఈ నూతన విధానము నమలు జరుపగోరు విద్యావేత్తలును ఉపాధ్యాయులును ఇందిమిడియున్న పౌరధర్మములను గుర్తింప గోరుచున్నాము. భావిపౌరులు మున్ముందు సాంఘిక, రాజకీయ, ఆర్థిక, వైజ్ఞానిక విషయములందు చాల యభివృద్ధిని చూపవలసి యున్నది. మరియు వారు పౌరధర్మములకు సంబంధించిన సమస్యలను, హక్కు బాధ్యతలను గుర్తించగలిగి యుండవలెను. వీలైనంత తక్కువ విద్యతో తమవిధులను చాకచక్యముతో నిర్వహించగల పౌరులను తయారు చేయగల సంపూర్ణమగు నూతనవిధాన మవసరమైయున్నది.

మరియు నీ కాలమున బుద్ధిమంతుడగు ప్రతిపౌరుడును ఏదో కృషియందు నియుక్తుడై నాగరికమును సుశిక్షితమును నగు సంఘమునకు ఏదోరూపమున సేవ యొనర్పగలిగి యుండవలెను. శ్రీమంతులైనను పేదవారైనను సంఘమునకు చీడపురుగులుగను భారమిచ్చువారుగను ఉండునటుల వారిని తయారుచేయు విద్యావిధానము గర్హ్యము. అట్టిపద్ధతివలన సంఘమునందలి నిర్మాణశక్తి నశించుటయే గాక జాతికి అసహాయకరమును, అవినీతికరమును నగు మానసిక స్థితి ఏర్పడును. మా విధానము ఇందులకు ప్రతిగా మానవుల కుపయోగించు ప్రతికృషియు పాకీ పనితోసహా గౌరవభాజన మను తలంపు గలిగి నిర్మాణక్రియాశూరులై తమ కాళ్ళపై తాము నిలువ శక్తులగు నుత్తమపౌరులను తయారుచేయ సమకట్టుచున్నది.

ఈ విధముగా వారు స్కూలునందు చేయు పనికిని సంఘమునందు జరుగుపనికిని సన్నిహిత సంబంధ మేర్పడుటచే విద్యార్థులు తాము పాఠశాలావరణములో పొందు ఇతర విజ్ఞానమును సైతము జీర్ణించుకొని లోకహితమునకై కృషిచేయ గలరు. అందువలన మా విధానము భావిపౌరులగు ప్రతివారియందును వ్యక్తిత్వమును గౌరవమును ప్రతిష్ఠించి సమర్థతను పెంపొందించి వారి యందు స్వాభివృద్ధికిని, సాముదాయికమగు సంఘకృషికిని తీవ్రమగు ఇచ్ఛను రేకెత్తింపగలదు.

సారాంశము: ఈ విధానము సహకారయుతమైన సంఘము కోరదగినదనియు మిగత కార్యక్రమమంతటికంటెను సంఘసేవ యుత్తమమైనదనియు వారి హృదయములందు భావబీజములు నాటగలదు. విద్య నేర్చుకొనుచున్నను తాము జాతికి ప్రత్యక్షముగా తోడ్పడు విధానము నవలంబించి గొప్ప సమస్యయగు జాతీయ విద్యా సమస్యను పరిష్కరించుచున్నామని వారు భావింపగలరు.

## స్వయంపోషకత్వము

ఈప్రణాళికయందలి స్వయంపోషకత్వమునుగూర్చి పెక్కు విమర్శలు గావింపబడియుండుటచే కొంత ముచ్చటించవలసి యున్నది. వార్ధా సభయందంగీకరించబడి మాచే వివరించబడిన యీ కర్మవిద్యతో కూడిన విధానము సమర్థమైనదని నొక్కి వక్కాణించుచున్నాము. పూర్తిగా స్వయంపోషణ సమర్థము గాకపోయినప్పటికిని గూడ ఈ ప్రణాళిక పటిష్ఠమైనదియు వెన్వెంటనే జాతీయనిర్మాణమునకు గడంగునదియునగు విధాన మని యంగీకరింపవలసియున్నది. అట్టి విధానము చాలవరకు స్వయంపోషక మగుటగూడ అదృష్టమన దగియున్నది. వార్ధామహాసభయందు నిర్ణయింపబడిన 7 సంవత్సరముల విద్యాకాలములో నిది ఎటుల సాధ్యమో మేము నిరూపించియున్నాము.

జాకీరు హుస్సేను కమిటీవారు సిఫారసు చేసిన పాఠ్యక్రమమును చదువుటకు ముందుగ వార్ధావిధానముయొక్క మూలసూత్రములను గమనింతురుగాక. వార్ధావిధానమునకు శేగామవిధానమను పేరును గలదని జ్ఞప్తియుంచుకొందురుగాక. ఈవిధానమునకు మూలకర్తయగు శ్రీగాంధీమహాత్ముడు తాను వసింపుచున్న శేగామగ్రామములో ఈ విధానమును ప్రప్రథమమున ఆచరణలో పెట్టి పరిశీలనము చేయుటచేత దీని కా పేరును సార్థకమయ్యెను.

ఈ విధానమునకును ప్రస్తుతపు విధానమునకును విశేషభేద ముండుటచేత చాలమంది దీని అనుష్ఠానమును విప్లవ మనుచున్నారు. అగుగాక!

### 1. శైక్షణ—వార్ధా (లేక శేగామ) విధాన మూలసూత్రములు

విప్లవములు రక్తపాతమువలననే జరుగనక్కఱలేదు. అట్టహాసమే దీనికి ప్రాతిపదిక కాదు.

విప్లవము, పరివర్తనము అట్టహాస ప్రాబల్యముల కెడమీయక యే చడి చప్పుడు లేకుండ సంఘటిల్లగలవు.

మనదేశము గత 20 ఏండ్లనుండియు శాంతపరివర్తన మందుచున్నది. దీనికి ద్రష్ట యోగి గాంధీమహాత్ముడు.

ఇప్పుడు మరియొక పరివర్తనము సంఘటింపనున్నది. ఇది విద్యావిషయమున సుమారు 200 ఏండ్లక్రిందట ఆంగ్లశాసనులోకి ప్రాతిస్వపద్ధ ప్రవేశపెట్టబడి ఇంతవట్టును అవాంతరదశయందే యున్నది.

ఏ భాషలో పండితులైనను విద్యాధికుల సంఖ్య అత్యల్పము. ప్రాత కాలము గని పామరజన మశేషము. పామరులకు పండితులకు మధ్య పెద్ద యఘాత మేర్పడి నది. ఈ యఘాతమును పూడ్చివైచి భేదవిభేదములు లేక అందఱను ఒకే బడును నందు వయునింపజేయు టెట్లు ?

దీని కొక్కటే సమాధానము. పామరులకుగూడ పాండితీ దీక్ష నీయవలయును. వీరంత ఎత్తునకు చేరలేక పోవుచో ఎత్తును కొంతవట్టు దిగ్గింప వలయును.

సరియే. ఈ దృష్టిని అవలంబనము చేసికొని ఇప్పటి వ్యవస్థ పరిస్థితులలో మన దృష్టిని యోగరూఢము చేయు టెట్లు ?

జ్ఞానము ప్రసాదింపబడవలయును. కాని కేవల విషయ పరిజ్ఞానమూ లేక ఆత్మ ప్రదానము గూడనా ?

ఇప్పుడు గ్రహింపబడిన యీ దృష్టికి సర్వాంగహింస లాధారములు, నిర్వచిత విధానమంతయు సరిగ నవగాహము కావలెనన్న ఈ పునాది నర్థముచేసికొనవలెను. జగత్తున విభిన్న దేశములు, విభిన్న విధములు, వివిధపరిస్థితులు కానవచ్చుచున్నవి. ఒకేపద్ధతి అన్ని పరిస్థితులందును వర్తింపదు. ఏదేశమున కాదేశమునకు మార్పు లవసరమై యుండును. మన దేశమునకు మన సంప్రదాయములకు మన భావనా సంపత్తికి ఇప్పుడు సూచించుచున్న పద్ధతియే ఉత్తమ మని కన్పట్టుచున్నది.

అశేషజనమున కీవర్ణనోచితమైన విధమున జ్ఞానోదయము కావింపవలెను. సాధనసంపత్తియూ ఇంకను సన్నద్ధము కాలేదు.

ఈ 'మూలశిక్ష' యందు వృత్తివిద్యకు ప్రాధాన్యము గలదు. కాయకష్టము ద్వారానేగాని మానవుని సంపూర్ణవికాసము సిద్ధింపనేరదను ప్రత్యయమే దీనికి ప్రధానకారణము. తరువాత మనదేశమున ప్రస్తుత పరిస్థితులలో విద్యావిధానము సార్థకమై సఫల మగుటకు స్వావలంబనమాత్రమే శరణ్యము, ఇది యంతయు ప్రభుత్వకర్తవ్య మనవచ్చును. కాని ప్రభుత్వము మాత్ర మేమి చేయగలదు? ముప్పది కోట్ల మందిని విద్యావంతులను జేయుట సులభసాధ్య తేలునదిగాదు.

ఈ విషయ మతి ముఖ్యమైనది. ఊరక అధిక్షేపించుటకు బదులు లోపములు చూపునప్పుడు వేఱు సాధనోపాయము చూప గలుగుచో విమర్శ రాణించును. మహాత్మునిలో నున్న పెద్దసుగుణ మిదియే. ఏదేని సరిగా లేదనునపుడు దానికి వికల్పమును చూపినగాని ఆయన మాటాడబోడు.

ఈ అతిగహన విషయము కూలంకషముగా చర్చించి మనము త్రొక్కఁబోవు పంథను కనులు తెఱచికొని హృదయ పూర్వకముగా ఈ విధాన సంసిద్ధికై పాటు పడవలసి యున్నది గాన విజ్ఞులందఱును ప్రత్యేకముగా శ్రద్ధ వహించి ఏతత్ప్రవర్తనమునకు తోడ్పడుదురుగాక!

ఈ క్రింది యిరువది సూత్రములలోను ఏతద్విషయమున నభిజ్ఞులగు శ్రీ కిశోర లాల్ ఘనశ్యామమష్రువాలా గారు గాంధీజీ సిద్ధాంతమునంతను చక్కఁగా క్రోడీకరించియున్నారు. శ్రద్ధాళువులై పఠింతురుగాక.

1. శ్రీ గాంధీమహాత్ములు ప్రతిపాదించుచున్న విద్యావిధానమునకు సూత్రములకు వార్ధా (శేగాము) విధాన మని పేరిడబడినది. శేగాములో నుండగా మహాత్మునికి గోచరించుటచే శేగాము విధాన మనియు పేరుగలదు.

2. బాలునకు కార్యదీక్ష అహింసాసూత్ర ద్వారమున నీయబడును.

3. హింసను తొలగించి శాంతమును చేకొను దేశ వర్గములం దన్నింటను ఈ పద్ధతి యోగ్యమని యెంచబడుచున్నది. ఏది ఎట్లైనను మన దేశమున కిదియే యోగ్యము.

4. వివేచన యొకింతగా కనఁబడు చిన్ననాటనుండియు అన్య కర్మ లందు పిల్లలను ప్రవీణ జేయుట ఈ పద్ధతి ఉద్దేశ్యము.

5. సార్థకమైన పరిశ్రమ ఈ పద్ధతికి మూలము. శిక్షణయంతయు ముఖ్యముగా నిట్టి పరిశ్రమద్వారముననే దీని నాశ్రయించుకొనియు నడచును. దేశచరిత్ర, భూశాస్త్రము, గణితము, శారీరకశాస్త్రము, సంఘశాస్త్రము, సారస్వతము — ఇవన్నియును ఈ పరిశ్రమనే చుట్టుకొని దీనికే అంటిపెట్టుకొని యుండును. ఇతర విషయములకు తావుండదనికాదు. ప్రాధాన్యము మాత్రము వీనికే.

6. పరిశ్రమ బోధనకు సాధన మాత్రముగనే యుండఁబోదు. మనుష్య జీవనమున దీనికి గల ఆవశ్యకతనుబట్టి అంత బోధ్యమగును. కాయకష్టమున గల — పాటుపని యొక్కయు — ఔత్కృష్ట్యమును నేర్పవలెను. మేనుపాటుచే న్యాయముగా జీవిక జరుపుకొనవలె ననియును బాలుడు గుర్తించునట్లు చేయుట దీని ఉద్దేశ్యము.

7. ఇది పంతులుగారిపని నేర్పబడు పరిశ్రమద్వారముననే కుఱ్ఱనిలోని నైతిక, శారీరిక, మానసిక శక్తులను వెలువఱచుట.

8. శారీరిక, సాంఘిక శాస్త్రములు బడిపనులలోనే మునిగియున్నవి, పరిసరములందలి ప్రాణిలోకమునకు సేవామూలముగా ఈశాస్త్రములను బోధింపవలెను. ఈ బడి నుండి పరిసరములకు జ్ఞానము ప్రసరింపవలెను.

9. ఈ తెలుగునంతను ఇట్లు టంకింపవచ్చును. "కర్మద్వారమున జ్ఞానద్వారమునకు, సంఘద్వారమున ఒజ్జనుండి వేలుపునకును."

10. బడిపిల్లల దేవృత్తియైనను రూప భేధ విలక్షణ లేక ప్రతిరోజు 3, 4 గంటలు కలిసి పాటుచేయునెడల వారి కిది వ్యాపకమై దేహమునకు పుష్టినిచ్చి మనస్సును వికసింపజేయ గలదు. "శాస్త్రపరిశ్రమలయు, సంఘముయొక్కయు ప్రయోజనాను సారము సమగ్రమైన శాస్త్రజ్ఞానమును సమగ్రమగు పరిశ్రమను జ్ఞానముతో మేళవింప గల విద్యను పుట్టువాని ఏదైనను ప్రతివానికిని బోధింపవలెను" (క్రొపాట్కిన్)

11. ఉన్నత విద్య ముగియుచున్నప్పుడుకూడ పిమ్మట కర్తవ్య మేదియో ఎక్కువమంది తెలియజాలకున్నారు. చదువుల బడులన్నియు ప్రసాదించుననుకొను జ్ఞాన సముపార్జనము కూడ గాక వేరు త్రోవ కనుపడక పోవుటచేతనే పరిస్థితులు విషమించనంతవరకును బహువ్యయమునకు లోనై పిన్నవారనేకు లీవిద్యాధవనములో మొదటిదశనుండి రెండవ దశకు, రెండవ దశనుండి మూడవదశకు ఎక్కిపోవుచున్నారు. జీవితమున నే త్రోవ త్రొక్కవలయు నను క్లిష్టప్రశ్నను దూరముననుండుటకే వీరు చదువు సాగించుచుందురు. దారి తెన్ను లేని ఈ తెలుగున లేబ్రాయమంతయు వదియేండ్లకుపైగా గడచిపోవునప్పుడు జాడ్యము, జంకు, చాపల్యము, బ్రతుకు తెరువు విషయమున బిత్తరపోవుట—ఇట్టి పలవడి తీరును. సేగాము పద్ధతి ప్రకారము ఘావివృత్తి పిన్నవయసుననే పాతుకొనును. సుఖజీవనమును గల్పింపగల ఒక్క వృత్తియైనను బాలున కలవడ గలదు.

12. సేగాము విధానమునందు అక్షరజ్ఞానమే (అనగా వ్రాతకోతలమూలమున వివిధవిషయముల పరిజ్ఞానముగలిగి తర్కాది వాదములను గ్రహింపగల్గుట) జ్ఞానము గాని జ్ఞానసాధనముగాని కాదు. విద్యావిద్యలకు గూడ నిది లచ్చనము. జ్ఞానమూలములు చైతన్యవంతము లగుచో ఇట్టి లక్షణములను గూర్చిన తెలివిడి వలన ఉపయోగము, అవసరము నుండును. ప్రమేయ పరిశీలనములు, కర్మ ప్రయోగములు, ప్రేమ, సేవ, అనుభవము—ఇవి ఇందులకు మార్గములు. ఇవివినా కేవల పుస్తకజ్ఞానము పతితవికాసమునకు గుదిబండయై దేహపాటవమునుగూడ భంగింపగలదు.

13. ఈ పద్ధతి ననుసరించు మూలశిక్షణము తల్లిభాష పక్కాగా వచ్చియుండవలెను. తత్సాహిత్యపరిచయ ముండవలెను. జాతీయభాష వచ్చియుండవలెను. గణితము, చరిత్ర, భూజ్ఞానము, శారీరకము, సంఘశాస్త్రము, చిత్రలేఖనము, సంగీతము, వ్యాయామము, ఆటలు, ఉపకారాయి మొదలైనవి బోధింపవలెను. సామాన్య విద్యార్థిని పోషింపగలుగునట్లు పరిశ్రమ నొకదానిని నేర్పవలెను. ఇంకను ఎక్కువగా వృత్తివిద్యను గాని వృత్తిపరవిద్యనుగాని అభ్యసింపగోరు "మెరికల" కవకాశము లుండవలెను. మనుగడకు బుద్ధి శిక్షకు స్వసంస్కారమునకు అగత్యము కానట్టి ఇంగ్లీషు మొదలైన విషయముల నీదశలో బోధింపగూడదు.

14. ఈ మూలశిక్ష ఏడేండ్లకు తగ్గరాదదు. అవసరమగుచో ఇంకను కొద్దికాలము పొడిగింపవచ్చును. వివరింపబడనున్నతీరున బదులు తమ్ము దాము పోషించుకొన గలుగుచు పిల్లల తండ్రులకు కొద్దియో గొప్పయో ముట్టునెడల పుత్రుల నింకను కొంతకాలము భరించుట తండ్రులకు కష్ట మనిపింపదు.

15. రాజ్యతంత్రము యొక్క విది ప్రయోజనములనుగూర్చియు కనీసపు భృతిని గూర్చియు కొన్ని ముఖ్యాంశము లీశేగామపద్ధతియం దిమిడియున్నవి.

16. ప్రభుత్వముచే నిర్బంధముగా శిక్షణ నంది ప్రభుత్వసేవ చేయ నిచ్చగించు వయోజనులందఱకును లాభకరమగు పని గల్పించి సుఖజీవనమున కవశ్యమగు కనీస భృతినైనను ఈయలేకపోవుచో ఆ ప్రభుత్వమునకు సార్థకత లేదు.

17. మన దేశములో ఇప్పటి బజారు ధరలనుబట్టి సగటు వేగమున పనిచేయు ప్రతిగంటకు కనీసపుభృతి అణాకు తక్కువ కాకూడదు.

18. ఇప్పటి రాజ్యతంత్రము, సంఘకట్టు ఈ మట్టమునకు క్రిందుగనే యున్నవి. అందుచేత 'ప్రభుత్వ' పదమునకు మనము తగము. ఈ లోటునకు కారణ మన్యప్రభుత్వమైనను మనమే యైనను వెంటనే చక్కబెట్టవలసి యున్నది. తిన్నదనముతోను దిట్టదనముతోను ఈ శేగామ పద్ధతిని ప్రయోగించుచో అవసరమగు మార్పులను కలుగజేయుటకు తగు పుష్టి నిచ్చి సరియైన త్రోవలో పెట్టగలరు.

19. ఈ లక్ష్య సిద్ధికై ప్రభుత్వమునకు నష్టము గల్గింపక ఎంతమందికైనను పనిచూపగల పరిశ్రమను చేపట్ట వలెను.

20. మన దేశములో ఇట్టి పరిశ్రమ ఒక్కటియే యున్నది. అది రాట్నపు పరిశ్రమః నేతపరిశ్రమ. ఈపరిశ్రమ కుండవలసిన సదుపాయములన్నియు ముడిసరుకు

చక్కవ పెట్టుబడితో సాగింప వీలు. పరిశ్రమలో నైపుణ్యమును గడించుటకు తగిన హంగు. మొదలైన సదుపాయములన్నియు నున్నవి.

21. వడుకువాని కూలి యెన్నడును తృప్తికరముగా లేదు. మిల్లుసరకుతో పోటీచేయుటతో ఇది మరింత సన్నగిల్లిపోయెను. ప్రభుత్వము, ప్రజలు అట్టి పోటీ లేకుండునట్లు కృషిచేయవలెను. అంతవఱకును వడుకరికి జీవనభృతి నిచ్చు వెల మీద ఖద్దరుకే ఆమకొనుచు పోటీని సరకునేయుకూడదు.

22. అంతటను నేయుబడుకూలి జీవనభృతికైనను చాలునట్టుండవలెను. ప్రభుత్వము దీనిని సిద్ధింపజేయుటకు తగు బలము కూర్చుకొనవలెను. ప్రజలుగూడ నిందులకు పూనుకొనవలెను.

23. ఇపుడు వివరించిన జీవనభృతి ప్రయోజనములకు, బడిపిల్లలకు గంట కర్ధణాయని నిర్ధారింప వచ్చును.

24. ఏడాదికి తొమ్మిదినెలలపాటు సగటున రోజుకు మూడు గంటల లెక్కన శ్రేణామ పద్ధతి నవలంబించు బడియొక్క సార్థకత యిట్లుండవలెను: ఏడు తరగతులకు తగ్గకుండ సగటున తరగతికి 25 గురు పిల్లలుండు, నొక్క 9 మంది పంతుల్లను నున్న బడిలో ఉత్పత్తియగు సరకే పంతుళ్ళ సంవత్సర జీతముల నీయ గలిగి యుండవలెను. పంతుళ్ళ కొక్కొక్కరికి కనీసము రు 25లు అయినను నెల జీతముగా నుండవలెను. జీత మే సందర్భములోను నెలకు రు 20 లకు తగ్గి యుండగూడదు.

25. ఈ మెట్టును చేరునంతవఱకైనను పిల్లల శక్తుల నుద్దీపింపజేయవలెను. పనిముట్లు, బోధనాపద్ధతులు అనుగుణ్యముగ మారవలెను.

26. ఈ లెక్కన బడి యిచ్చుకూలిని అంచెనా వేయుచో బడి యుత్పత్తి చేయు వస్తువులకును ఆ యా పారిశ్రామికులకును హానిపేర్పడునని భయపడ నవసరము లేదు. పైన ఆశించిన ప్రమాణమున గ్రామబత్తెములు ప్రాప్తించునప్పటికి ఆయా పరిశ్రమలవారుగూడ సాధన సంపత్తి విషయమున అభివృద్ధి చెందకపోరు. కావున పోటీ గల్గు నను భయము నిరాధారము.

27. ఈ బడి బత్తెమును ప్రభుత్వమే యీయ వలసి యుండును. ఎట్లైనను అ. భా. చ. సంఘము, అ. భా. గ్రా. ఉ. సంఘము నిర్ణయించిన బత్తెమునకు తగ్గి యుండకూడదు. బడిలోని బత్తె మీ గంట కర్ధణా ప్రమాణమును చేరువరకైనను

ఆసంస్థలతోచాటు ముందునకు బోవలసి యుండును. నేటినా గాకపోయినను వేరుగా బడికి తీరున ధనసహాయము చేయుటయే యగును. ప్రభుత్వమునకిది భారమే యగును. అయినను పనివారల సాధన సామర్థ్యము పెంచి మ పెంపొందుట కవకాశము లుండుటచే ఇప్పు డున్న ధరలను పెంచుటయే బడి పనివారలుగూడ కనీసపు భృతిని సంపాదింప వీలుకలుగదని తలపబడుచున్నది.

28. కేవల మార్థికదృష్టితోనే ఈ స్వావలంబనసూత్రము నిర్వచింపబడలేదు. వృత్తివిద్యయొక్క సార్థకత కిది పరీక్షగా గూడ నుండగలదు.

29. ఖద్దరువాహకమైన మూలవిస్తరయినను యీ వివరణ ముద్దేశింపబడినది. ఇతర పరిశ్రమలమీద శిరకన్ను వేయ గూడదు. ఇప్పుడు పెక్కుగట్టిన విధముగనే ఇతర పరిశ్రమల విషయమునగూడ అంచెనా వేయుటకు వలయు సామగ్రి సమకూరలేదు.

30. ఉచితమైన పూర్వంతో ఉన్నత విద్యావిధానమునకు గూడ ఈ సూత్రములు వర్తింపగలవు. విద్యయెట్టిదైనను స్వావలంబనమై యుండవలెను. ఉన్నతదశలలో విద్యార్థుల పరిశ్రమవలననో జీతమువలననో సంస్థను పోషింపవలెను. అట్లు గాదేని జీతమిులీయకపోవుచో బడిలోపనిచేయుటమూలముగనో లేక ఇంకేపరిశ్రమనైనను అవలంబించుట మూలముగనో తమ్ముదాము నిలబెట్టుకొనగలిగి యుండవలెను.

## 2. శిక్షను—వార్ధా విధాన వివరణము

మా కీయబడిన స్వల్పవ్యవధిలో 7 సంవత్సరముల విద్యాకాలమునకు సమగ్రమైన విధానమును సూచించుట సాధ్యము కాలేదు. అయినను సాధ్యమైనంత వరకు పలుశీర్షికల క్రింద ఈ క్రొత్త పూర్తచేయదగిన కార్యక్రమమును తెలిపి యుంటిమి. ఇకనుండి యొక్కొక రాష్ట్రీయవిద్యాపరిషత్తు 7 వత్సరముల విద్యావిధానమునకు సరిపడు విధమున నీ కార్యక్రమమును నియమితమొనర్చి యందులకు బాధ్యత వహించగల నిపుణుని నియమించవలసియుండును. ఈ నూతన విద్యాలయములందు తగిన సలహా, సరియైన శిక్షణల క్రింద పనిచేయు నుపాధ్యాయులే తమ యనుభవమునుబట్టి యీ సంబాయిషీని చేకూర్పగలరు. మేమునైత మిట్టివిధానమును తయారుచేసి త్వరలో నీనివేదికకు అనుబంధముగా ప్రకటించ యత్నించుచున్నాము.

# సప్తవర్ష ప్రాథమిక విద్యా విధానపు ముఖ్యాంశములు

## I ప్రధాన పరిశ్రమ

ఈ దిగువ పరిశ్రమలను ప్రధానమైనవిగా ఎన్ని అందు బాలురకు శిక్షణ మీయ వలెను. ప్రతివిద్యార్థి యవలంబించిన వృత్తియందు నతనికి విద్యాలయము విడిచిన పిమ్మట జీవితము సుఖముగా గడుప గలుగునట్టి నిపుణత యలవడవలెను.

(1) వడుకుట, నేయుట (2) వడ్రంగము (3) వ్యవసాయము (4) కూరగాయలు, పండ్లు పండించుట (5) తోళ్లపరిశ్రమ (6) పైనతెలిపిన పద్ధతుల ననుకూలించు స్థానికముగా నున్న వే యితర పరిశ్రమ మైనను.

వ్యవసాయము, వడుకుట, నేయుట—వీనికి భిన్నమగు పరిశ్రమ నేచేని నేర్వ వలసి వచ్చినను లేలిక వ్యవసాయము చేయుట, ఏకుట, తక్లీమీద వడుకుట ప్రతి విద్యార్థియు నగత్యముగా నేర్చుకొనవలెను.

## II మాతృభాష

మాతృభాషను సరిగా బోధించుటయే విద్యకు పునాది. ఇతరులకు నచ్చునట్లు మాటాడ గలుగుట, సరిగాను ధారాళముగాను చదువ గలుగుట, వ్రాయ గలుగుట నేర్వనిది ఎవ్వరును భావముల నభివృద్ధిచేసికొనుట గాని, నిశ్చితమైన యభిప్రాయమును దెలుపుటగాని చేయజాలరు. తన తండ్రి తాతల యుత్తేజకర మగు విజ్ఞానమును గ్రహించి తద్ద్వారా బాలుడు సర్వవిధముల నభివృద్ధిగాంచుటకుకూడ మాతృభాషయే మూలము. తమ సహజభావములను మాతృభాషలోనే వారు సంతోషముతో వెలిబుచ్చ గలుగుదురు. ఆ యభిలాషకు మనము దోహదమొనర్చినచో వారికి క్రమముగా వాఙ్మయము మహోల్లాసమును గలిగించగలదు. మరియు నేడు వత్సరముల యనంతర మీదిగువ యుద్దేశ్యములు నెరవేరవలెను.

1. బాలకుడు తన పరిసరముల నున్న మనుష్యులు ప్రదేశములు, అచట జరిగిన పనులను గూర్చి విశ్వాసముతోను, స్వాభావికముగాను, ధారాళముగాను మాటాడ గలిగి యుండుట.

2. మరియు నటులనే ప్రజాదృష్టి నాకర్షించు నిత్యవ్యవహారములను గూర్చి సందర్భశుద్ధి గలిగి లక్షణ కలిగించునట్లు వాగ్ధోరణి కలిగి యుండవలెను.

3. కొలదిగా కఠినమైన వ్యాసములు వర్తమానాలను అర్థమగునట్లు వడిగా ఏకాగ్రముం దుండి చదువుకొన గలుగుట (ఈ శక్తి కనీసము దినపత్రికలు, వారపత్రికలు చదువుకొనగలుగునంతవఱకైన అభివృద్ధి కావలెను)

4. గద్యపద్యములను శ్రావ్యముగాను ఉత్సాహముతోను ఇతరులకు బోధపడునట్లు బిగ్గఱగా చదువగలిగి యుండుట. (గొంతు బొంగురుపోవునట్లును నిర్జీవముగను వల్లించు పద్ధతిని విద్యార్థి గ్రహించకూడదు.)

5. వార్తాసంగ్రహముకొఱకును, ఆనందముకొఱకును గ్రంథాలయము నందలి గ్రంథములను చదువుకొన గల సమర్థత.

6. సరిగాను స్పష్టముగాను సామాన్యవేగముతోను వ్రాయ గలిగి యుండుట.

7. తన గ్రామమున జరుగు సాముదాయిక సమావేశములు వర్తమానాలను గుఱించి సులభము, స్పష్టము నైన భాషలో వ్రాసి వర్ణించ గలుగుట.

8. స్వంత ఉత్తరములను సామాన్యమైన వ్యాపారపుటుత్తరములను వ్రాయ గలుగు నేర్పు సంపాదించుట.

9. ఉత్తములగు గ్రంథకర్తల రచనలతో పరిచయమును, వానిని చదువుట యందు ఉత్సాహమును గలిగి యుండుట.

## III గణితము

వ్యక్తి జీవితములోను వ్యాపారములోను సంఘములోను మెలగుటకు అవసరమైనంతవరకు గణితము నేర్పిన చాలును. మరియు విద్యార్థులకు వ్యాపారపద్ధతులు, వ్యాపారము నడుపుట కుంచవలసిన లెక్కలు, పద్దులు వ్రాయుట నేర్పవలెను.

సామాన్య కూడిక, తీసివేత, గుణకార భాగహారములు, 4 కాంపౌండురూల్సు, నాణెములపై లెక్కలు, తూనికలు, కొలతలు, వడ్డీలు కట్టుట, క్షేత్రగణిత విధానము, వ్యాపారమున కవసరమైన లెక్కపుస్తకములను వ్రాయుపద్ధతినేర్పుట, వానియందు అనుభవములు కలిగించుట—వీనితో పై యుద్దేశ్యము నెఱవేఱునని మేము నమ్ముచున్నాము. శిక్షణ సాధ్యమైనంత వఱకు బాలురు చేయుచున్న పరిశ్రమమును సాంఘిక విద్యాలయ జీవితమునకును సంబంధించినదిగా ఉండవలెను. అందు వలన బాలురు త్వరగా నీ పరిజ్ఞానమును పొందగలరు.

# IV సాంఘిక విద్య

ఇందలి ప్రయోజనము లివి :

1. విద్యార్థికి విశాల మానవాభ్యుదయమునందును ముఖ్యముగా స్వజాతీయాభివృద్ధియందును అభినివేశము కల్గించుట.

2. మరియు నాతనిని తన సాంఘిక, ప్రాంతిక పరిసరములను సరిగా గ్రహించునట్లును, వాని యభివృద్ధికి ప్రయత్నించునట్లును బురికొల్పుట.

3. మాతృభూమియందు ప్రేమ, మాతృదేశపు పూర్వచరిత్రయందు గౌరవము, మాతృదేశ భావిచరిత్ర సత్య ప్రేమ ధర్మములపై నాధారపడి ఏకమై యన్యోన్య శ్రేయము కొఱకు కృషిసల్పు దేశీయుల కాశ్రయమై విరాజిల్లగల దను విశ్వాసము నతనికి గలిగించుట.

4. పౌరధర్మములకు సంబంధించిన అధికారబాధ్యతలను సవ్యముగ కరపుట.

5. విశ్వాసియు, సహాయుడు నగు తోడిపౌరుడుగ నుండునట్లు వ్యక్తిపరముగాను, సాంఘికముగాను మెలగు పద్ధతులు బోధించుట.

6. ప్రపంచమతములయెడ అన్యోన్య గౌరవమును వృద్ధినొందించుట.

మరియు నీ ఉద్దేశ్యములు నెరవేరుటకు చరిత్ర, భూగోళము, పౌరబాధ్యతలు, ప్రస్తుత పరిస్థితులు వీనితోబాటు గౌరవపురస్సరముగా ప్రపంచ మహామతములను గూర్చియు, నవి మూలసిద్ధాంతములం దెట్టుల సమన్వయ మగుచున్నదియు బోధించుట మిక్కిలి యవసరము, ఈ బోధ బాలకుల పరిచిత విషయములలోను తత్సంబంధమైన సమస్యలతోను ప్రారంభమై క్రమముగా పైవిషయములకు బోవలెను.

1. సంగ్రహముగా మన దేశ చరిత్రయు దేశీయుల సాంఘిక, వైజ్ఞానికాభివృద్ధిని గూర్చియు బోధించి రాజకీయ వైజ్ఞానికాభివృద్ధి యెట్టుల ఐకమత్యమునకు తోడ్పడుచున్నదియు చూపవలెను. విశేషించి సత్య ప్రేమ ధర్మములను గూర్చియు, సాముదాయిక కృషినిగూర్చియు, జాతీయైక్యతను గూర్చియు, మానవ సర్వసమానత్వ సోదరత్వములను గూర్చియు నొక్కిచెప్పవలెను. ఇందును గూర్చిన బోధ దిగువ తరగతులందు కథల రూపముగాను పైతరగతులందు సాంఘిక విధాన నిదర్శనములతోను కూడియుండవలెను. పూర్వచరిత్రలను బట్టి విద్యార్థులు గర్వించి సంకుచిత దృష్టితో ఇతర సంఘముల కసాయము కలిగించు వైఖరి నవలంబించ

కుండునట్లు శ్రద్ధవహించవలెను. ఈ ప్రణాళికయందు మానవోద్ధారకుల యుదంతము లును, వారి శాంతివిజయములును ముఖ్యస్థానము బడయవలెను. ముఖ్యముగా హింస, వంచన, కుతంత్రము మున్నగువానికి శత్రువైన యహింసయొక్కయు దాని యుపగుణముల యొక్కయు ప్రభావమును గూర్చిన పాఠముల ననుభవ పూర్వక నిదర్శనములతో బోధించవలెను. భారతజాతీయ ప్రబోధముయొక్క చరిత్ర ద్వారా దాని యార్థిక, సాంఘిక, రాజకీయ స్వాతంత్ర్య సమరమునందు విద్యార్థులకు అభిమానము పుట్టించి తత్సమరసభావమును వారుకూడ సంతోషముగా స్వీకరించు నట్లు క్రమేణ వారిని తయారు చేయవలెను. ప్రతి విద్యాలయమునందును జాతీయోత్సవము, "జాతీయ వారము" జరుపుచుండవలెను.

2. ప్రజోపయోగసంస్థలనుగూర్చియు, పంచాయతులు, సహకారసంఘములు, వాని పద్ధతులనుగూర్చియు, ప్రజాసేవకుల (అధికారుల) విధులను గూర్చియు, పురపాలక సంఘములు, జిల్లాబోర్డుల నియమావళులను గూర్చియు, ఓటుయొక్క విలువ, ప్రాముఖ్యములను గూర్చియు, ప్రజానియోజకసభల ప్రాముఖ్యము, అభివృద్ధిని గూర్చియు విద్యార్థులు బాగుగా తెలిసికొనవలెను. ఈ శిక్షణము వీలైనంత ప్రత్యక్షానుభవముతో కూడియుండవలెను. ఒక్కొక్క స్కూలునందును స్వపరిపాలనాధికారము గల సంస్థల నేర్పరచవలెను. మరియు విద్యార్థులందరును సమావేశమై, పత్రికలద్వారా దేశమునందు ఎప్పటికప్పుడు జరుగు విశేషములను చదువుచుండవలెను.

3. ప్రపంచభూగోళమునుగూర్చి సంగ్రహముగాను, భరతవర్షమునుగూర్చియు ఏతత్సంబంధముగల యితర దేశములనుగూర్చియు పూర్తిగాను నేర్పవలెను. మరియు నీబోధనము దిగువ విషయముల నిముడ్చికొనియుండవలెను.

(అ) ఈదేశమునందును ఇతరదేశమునందును గల జంతు వృక్షజాలములను గూర్చియు, మానవులనుగూర్చియు, శీతోష్ణపరిస్థితుల ననుసరించి కలుగుమార్పులను వర్ణనల ద్వారాను, బొమ్మల ద్వారాను తఱచు గ్రామపరిస్థితులతో బోల్చి చర్చల ద్వారాను, ప్రత్యక్షముగా చూపియు బోధించుట.

(ఆ) వాతావరణపు మార్పులు (సూర్యుని చూచియు, వివిధ ఋతువులలో మధ్యాహ్న మెటుల మారుననియు, గాలి వడి తగ్గుట, ధర్మామీటరు, బరామీటరు కొలతలు, వాతావరణస్థితి, వర్షము కొలుచుట, వివిధ మాసములలో రాత్రి ఎంత పగలెంత యుండునది, మొదలగునవి.)

(ఇ) దేశ పటములను గీయుట, పరిశీలించుట, పరిసర ప్రాంతముల ప్లానులను గీయుట, పరిశోధించుట మొదలగునవి.

(ఈ) పరిశ్రమలకును, నిత్యజీవితమునకును సంబంధించిన వార్తా, రవాణా సౌకర్యములనుగూర్చి తెలిసికొనుట.

(ఉ) వివిధవృత్తులను గురించి, గ్రామములోని పరిశ్రమలు? వ్యవసాయమును గూర్చి పరిశీలన—(కర్మాగారములకు, పొలములకు వెళ్ళుటద్వారా); ఆర్థిక స్వయం సంపూర్ణతను పొందువిధమును తెలిసికొనుట; అన్యోన్యాశ్రయములై యుండు ప్రాంతములను గురించి, ఎఱుగుట; ఆ యా ప్రాంతముల కనువైన వ్యవసాయ పద్ధతుల. పరిశ్రమ పద్ధతుల నెరిగి యుండుట; భరతవర్షములోని ప్రధాన పరిశ్రమలనుగూర్చిన జ్ఞానము కలిగి యుండుట.

## V సామాన్య విజ్ఞానము

ఇందలి ప్రధానోద్దేశ్యము లివి :

1. విద్యార్థులకు ప్రకృతిపరిశీలనాభ్యాసము, అందలి యానందము, మార్పులు గ్రహించ గల అనుభవము కలిగించుట.

2. వారి చుట్టుపట్లనుండు ప్రకృతిపరిస్థితులలోని వైజ్ఞానికసూత్రములను గ్రహింప గలుగునట్లు చేయుట: ప్రకృతి విజ్ఞానము మానవసేవ కెట్లుపయోగపడుచున్నదియు చూపుట; మరియు భౌతికశాస్త్రవేత్త లెట్టిత్యాగముల నొనర్చినదియు బోధించుట.

వివిధశాస్త్రములనుండి ఈదిగువవిషయములనుకూడ విద్యార్థులకుబోధించవలెను.

1. ప్రకృతిపరిశీలనము : వృక్షములు, పైరులు, మృగములు, పక్షులను గూర్చియు, ఋతువుల మార్పులు, వానినిబట్టి చెట్లుచేమలయు, మనుష్య పశు పక్ష్యాదులయు నభివృద్ధి యెట్లుండునదియు,

2. వృక్షశాస్త్రము ; వృక్షముయొక్క వివిధభాగములు, ఒక్కొక్క భాగము చేయు కృత్యములు, విత్తులు మొలకలు నాటుట, పెంచుట, అంట్లుకట్టుటయు నేర్చి స్కూలునకు చేరియుండు తోటయందును భూములందును చెట్లను పైరులను నాటించి వివిధరకముల ఎరువులు, విత్తనములు, వేడి, వెలుతురు, తేమలవల్ల నెట్టి ఫలితము కలుగునదియు బోధించుట,

3. జంతుశాస్త్రము : మనుష్యునకు సహకారులు శత్రువులు నగు వివిధ క్రిమి కీటకములను గూర్చియు, పక్షులను గూర్చియు,

4. మానవశరీరశాస్త్రము : మన శరీరము నందలి వివిధ అంగములు, వాని విధులను గూర్చియు.

5. ఆరోగ్యశాస్త్రము : (i) పండ్లను, నాలుకను, కండ్లను, ముక్కును, తల వెంట్రుకలను, చర్మమును, గోళ్లను, వస్త్రములను పరిశుభ్రముగా నుంచుకొనుట వంటి వ్యక్తిశౌచమునుగూర్చియు (ii) ఇల్లు, వాకిలి, గ్రామము శుభ్రపరచి ఆరోగ్యముగా నుంచుట, మలమూత్రములను విడుచుట విధమును గూర్చియు (iii) పరిశుభ్రజలమును సంపాదించుట, గ్రామనీటి బావిని జాగ్రత్తగా నుంచుటయును (iv) పవిత్రమైన గాలి, గాలిని శుభ్రమొనర్చుటలో చెట్ల సహకారము, వాయువును పీల్చవలసిన విధమును (v) ఆరోగ్యకరమైన లేక యానారోగ్యకరమైన యాహారమును గూర్చియు, సక్రమమైన యాహారమును గూర్చియు (vi) సాధారణ అంటు జాడ్యములు, ఆకస్మిక వ్యాధులు; వానిని రాకుండ జేయు సాధనములను, ఆరోగ్య రక్షణమునకు పవిత్రశీల మలవరచుకొనవలసిన విధమును గూర్చియు.

6. వ్యాయామము : ఆటలు, కుస్తీ, డ్రిల్లు. (దేశీయపు ఆటలను ప్రోత్సహించవలెను.)

7. రసాయనశాస్త్రము : గాలి, నీరు, ద్రవములు మొదలగువానినిగూర్చి.

8. ఖగోళశాస్త్రము ; నక్షత్రముల నడక, దానిని బట్టి రాత్రి ఎంత ప్రొద్దుపోయినదియు తెలిసికొను విధము.

9. కథలు, ఇతిహాసములు : వివిధ భౌతికశాస్త్రజ్ఞులయు పరిశోధకులయు చరిత్రలు, లోకకల్యాణమునకు వారొనర్చిన కృషియు.

## VI చిత్రలేఖనము

దీని ఉద్దేశ్యము లిపి :

1. వివిధవర్ణములను ఆకారములను బట్టి కన్నురూప భేదమును కనుగొనునట్లు చేయుట.

2. ఆకారములను జ్ఞప్తియం దుంచుకొనునట్లు చేయుట,

3. ప్రకృతియందును కళయందును గల సౌందర్యమును గ్రహించుటయును ఆనందించుటకు నేర్పు నలవఱచుట.

4. చక్కని సూకృతిని, యలంకారమును రచించ గలుగునట్లు చేయుట.

5. తాము నిర్మించ నున్న వస్తువులకు ముందుగా ఆకృతి నియగలుగు రచనను ప్రోత్సహించుట.

పై యుద్దేశము లీ దిగువ సాధనలవల్ల సిద్ధించగలవు :

(i) బాలురు తాము చదివినట్టియు చూచినట్టియు అంశములను చిత్రములద్వారా రూపించగల్గుట.

(ii) బాలురు నేర్చుకొను సాధారణ విజ్ఞానమునకు సంబంధించిన మనుష్యుల యొక్కయు పశుపక్ష్యాదుల యొక్కయు బొమ్మలను వాటివాటిని ఎదుట పెట్టుకొనియు పెట్టుకొనకయు గూడ రచించుట.

(iii) నగిషీ చిత్రములను చిత్రించుట.

(iv) గీతలు, గ్రాఫులు వగైరాలు చేయుట.

మొదటి 4 సంవత్సరములలోను గీయబడు బొమ్మలు ప్రకృతికిని వృత్తులకును సంబంధించిన చదువునకును అనుబంధమైనవిగాను కడపటి 3 సంవత్సరములలోను గీయబడునవి చిత్రాకృతి అలంకారశోభ వగైరా కలవిగాను ఉండునట్లు చూడ వలసి యుండును.

## VII గానము

ఇందలి యుద్దేశ్యము బాలబాలికలను వినసొంపగు పెక్కు గేయములను నేర్పి వారియందు శ్రావ్యమైన గాన విద్యయం దభిని వేశను కలిగించుటయే. మిగుల నుత్తేజమును కలిగించునవియు అర్థగాంభీర్యము ఉత్తమ నైతిక ప్రవృత్తియు గల పద్యములను పాటలను మాత్రమే నేర్పుటయందు శ్రద్ధబూనవలెను. బాలురు మొత్తముగా చేరి పాడు పాటలనుగూర్చి హెచ్చు శ్రద్ధ యవసరము.

## VIII హిందూస్థానీ

ఈ జాతీయవిద్యాలయములందు హిందీని నిర్బంధముగా నేర్పవలయుట ధావి పౌరులు గానున్న వీరందరును దేశైక్యభాషతో పరిచయము కలిగియుండుటకే. ఈ భాషను నేర్చిన వీరు పెద్దవారు కాగానే దేశములోని ఏ భాగమునకైనను బోయి యచటి సోదరదేశీయులతో చేతులు కలిపి కృషిచేయ గలరు. ఈ భాషను బోధించుటలో నుపాధ్యాయుడు విద్యార్థుల కిది హిందూ మహమ్మదీయ విజ్ఞాన ఫలితముగా నేర్పడిన వరప్రసాదమనియు, పైకిపోయిన కొలదియు నిందు వారి తాత తండ్రుల సంకల్పములు, మహోద్దేశ్యములు ఇమిడియుండుట కాంచ నగుననియు బోధించ

వలెను. ఈ భాషయొక్క సజీవత్వమునకును, విశాల వాఙ్మయమునకును భారతీయు లెల్లరును గర్వపడి దాని యభివృద్ధికి పూనదగును.

హిందూస్థానీ మాటాడు ప్రాంతములందు ఇదియే మాతృభాషగా నుండును. కాని అచటి విద్యార్థులును ఉపాధ్యాయులును గూడ హిందీ, ఉరుదు వ్రాతలు రెండును నేర్చియుండవలెను. ఇతర ప్రాంతములందు ఏరాష్ట్రమున కారాష్ట్ర భాషయే మాతృభాషగానుండి హిందీ 5, 6 తరగతులలో నిర్బంధముగా బోధింపబడును. విద్యార్థులు హిందీ, ఉరుదు లిపులలో తమకు నచ్చిన లిపిని నేర్చుకొనవచ్చును. ఉపాధ్యాయులు మాత్రము రెండు లిపులు బోధింపవలసియున్నప్పుడు రెంటిని నేర్చుకొనుట యవసరము.

ఏమైనను ప్రతిపల్లెకు పాఠశాలలోను ఈ రెండులిపులను బోధించుటకు వలయు నేర్పాటులు గావించు టగత్యము.

బాలబాలికలకు 5 వ తరగతివరకు ఒకేమాదిరివిద్య గరపబడును. కాని 4, 5 తరగతులనుండియు బాలికలకు గృహనిర్వహణమునుచేర్చి సామాన్య విజ్ఞానమును తగ్గించవలెను. 6, 7 తరగతులందు బాలికలకు పరిశ్రమకు బదులు గృహనిర్వహణమునందు ప్రావీణ్యతనొందు విద్య నేర్చుకొనుటకు అవకాశమీయవలెను.

## 3. శిక్షను—ఉపాధ్యాయుల శిక్షణ

సాధారణ పరిస్థితులలో సైతము బాలురకు చక్కని విద్య యలవడుటకు ఉత్తములగు నుపాధ్యాయు లవసరమన ప్రస్తుత విద్యావిధానమును సమూలముగా మార్చనెంచు మాస్కీము నమలుజరుపుటలో ఉపాధ్యాయు లెంత దిట్టలుగ నుండవలెనో చెప్పనక్కఱలేదు.

ఈ యుపాధ్యాయులు నూతన విద్యావిధానముయొక్క అంతర్యమును గుర్తించినవారుగాను దానిని ఆచరణయందుంచుటకు ఉత్సుకులుగాను ఉండవలెను. వారు సారస్వత విద్యలనేగాక పరిశ్రమలను గూడ నేర్పవలసినవారగుటచే కొన్ని ప్రధానపరిశ్రమలందు నిపుణత కలుగునట్లు వారికి శిక్షణ మీయవలసియుండును.

ఇదివరకుపద్ధతినిగాక వీరు పలువిషయములను బోధించునపుడు ఆ యా విషయములు వేర్వేరు కావనియు, అన్నియు జ్ఞానముయొక్కభాగములే ననియు, ఈయన్నిటికిని పరస్పర సన్నిహితసంబంధము కలదనియు, వీని అభివృద్ధి యొండొంటిపై ఆధారపడియున్నదనియు నేర్పుదురు. ఇందునుబట్టి వీరికి విద్యయందును, పరి

శ్రమయందును సమాన పాండిత్య మగత్యము. సంఘమునకును స్కూలునకును గల సంబంధమును కూడ వారు గ్రహించగలవారుగా నుండవలెను.

ముఖ్యములగు వీనియందేగాక అవసరములగు నితర విషయములు బోధించుటకు కూడ వారు ప్రావీణ్యత గడించవలెను. ఉపాధ్యాయతకు తరిఫీదు పొందగోరువారు ఎద్దైన జాతీయ విద్యాలయములోనో ప్రభుత్వ విద్యాలయములోనో ప్రవేశ పరీక్షవరకు చదివియుండవలెను. లేక మాతృభాషయందు పాండిత్యముగలిగి రెండు సంవత్సరములు ఉపాధ్యాయుడుగా పనిచేసియుండవలెను.

## ఉపాధ్యాయులకు వర్షత్రయ శిక్షణ

మూడు సంవత్సరముల ఉపాధ్యాయ శిక్షణకు పాఠ్యక్రమము ఈ దిగువ విధముగా నుండవలెను:—

**1.** (అ) ప్రత్తిపండించుట, ప్రత్తిని ఏరుట, ప్రత్తిని గాని ఉన్నిని గాని ఏకుట, నూలు వడుకుట, పడుగుచేయుట (ఆ) రాట్నము, దానియొక్క యితర పనిముట్లు గాని లేక తాను చేయుచున్న యితర పరిశ్రమకు సంబంధించిన పనిముట్లుగాని చెడినప్పుడు స్వయముగా బాగుచేయగలుగుట (ఇ) గ్రామపరిశ్రమలయు ముఖ్యముగా తాను చేపట్టిన పరిశ్రమ యొక్కయు ఆర్థిక విషయములు బాగుగా ఎరిగియుండుట (ఈ) అవసరమైనంతవరకు వడ్రంగము నేర్చియుండుట.

2. ఈ దిగువ ప్రధానపరిశ్రమలలో ఏదోఒకదానియందు పరిశ్రమచేయుట :— (అ) వడుకుట, నేతపని (ఆ) వ్యవసాయము (ఇ) కూరగాయలు, పండ్లు పండించుట (ఈ) వడ్రంగము (ఉ) ఆటబొమ్మలు తయారుచేయుట (ఊ) తోళ్ళ పరిశ్రమ (ఋ) కాగితపులు చేయుట (ౠ) ఆ ప్రాంతమున నుపయోగించు ఏ యితర పరిశ్రమయైనను.

3. విద్యాసూత్రములకు సంబంధించిన యీ దిగువ విషయములు నేర్చియుండవలెను:— (1) వృత్తివిద్యద్వారా విద్యబోధించనగు నను ప్రధానసూత్రము నందు విశ్వాసము (2) సంఘమునకు పాఠశాలకును గల సన్నిహితత్వము నెరిగియుండుట (3) శిశుమానసిక వృత్తులను గ్రహించి, వారికి విషయములను బోధించుటయందు నేర్పు సంపాదించుట (4) బోధనా పద్ధతుల తెలిసియుండుట (5) ప్రస్తుత దేశపరిస్థితులను అందుల కనువగు నీ నూతన విధానముయొక్క ఆదర్శములను చక్కగా తెలిసికొనుట.

4. సంగ్రహముగా శారీరశాస్త్రము, ఆరోగ్యశాస్త్రము, గ్రామపారిశుద్ధ్యము, ఆహారనియమములను నేర్చుకొనుట. గ్రామస్థుల సమస్యలను ముఖ్యముగా చర్చించి వానిని వీలగునంతవరకు క్రియాసాధ్యముగ జేయుట.

5. సాంఘిక స్థితిగతులను అవసరములను బట్టి సాంఘికవిద్యలను మార్చి అభివృద్ధి చేసి గడచిన 50 సంవత్సరముల భారత దేశస్థితిని ప్రపంచస్థితిని పరిశీలించుట.

6. సారస్వతాభినివేశము కలుగుటకుగాను మాతృభాషయందు ఉత్తమ గ్రంథములను చదువుట.

7. హిందూస్థానీయందు జ్ఞానము, హిందీ ఉరుదు లిపుల వ్రాయ గలుగుట బోధింపగలుగుట; ఇది ప్రభుత్వముచే స్వయముగా నడుపబడునట్టియు వారి సహాయము పొందునట్టియు సంస్థలన్నిటిలో నిర్బంధముగా నుండవలెను.

8. వ్రాత బల్లయందు వ్రాయుట, చిత్రలేఖనము,

9. శరీర వ్యాయామము, డ్రిల్లు, దేశీయక్రియలు.

10. ట్రెయినింగు స్కూళ్లకు చేర్చియుండుమాదిరి బడులలో బోధించుచుండుట.

ఈ బోధనాలయములందు విద్యార్థులును ఉపాధ్యాయులును కలిసి మెలసి నివసించుచుండవలెను. వారుభయులును కలసి తమ విరామకాలమునందు పెక్కు సాంఘికాభివృద్ధికరములగు కార్యములను సాగించుచుండవలెనని మేము కోరుచున్నాము. వారు ఇట్టి పెక్కు కార్యములందు పూనుకొనుటకును వానియందు చూపు దీక్షలోను అందువలన సంఘమునందును పాఠశాలలందును కలిగించుమార్పుమీదను యీ విధానముయొక్క విజయ మాధారపడియున్నది.

మా పైసూచనలు హెచ్చుగా నుండి కష్టసాధ్యములుగను ఆచరణకు నిరుపయోగములుగను కొందరికి తోచవచ్చును. కాని ఈ భావము సరికాదనియు సరియైన భావముతో ప్రారంభించునెడల నిది సుసాధ్యమేయనియు ముఖ్యముగా నీశిక్షణ ప్రస్తుతమువలెగాక 3 సంవత్సరముల కాలము జరుగుననియు మనము గుర్తించవలెను. మరియు నీ స్కూళ్లు కొలది కాలము చేసినచో అందు శిక్షణబడసి విమ్మట ఉపాధ్యాయులు కాగోరు యువకులు వృత్తి విద్యను సాంఘికవిద్యలను నేర్చియుందురు గాన ఈ శిక్షణాలయముల పని రాను రాను తేలికయగుననికూడ తెలుపగోరెదము. మరియు నీ పలువిషయములందు పాండిత్యము గాక, బోధనయందు

ప్రత్యక్షమగు పారస్వాస్థ్యము, ఆరోగ్యము, పారిశుద్ధ్యము, ప్రాథమిక చికిత్స, శిశు శిక్షణ వగైరా సమస్యలనుగూర్చి శ్రద్ధవహించబడును. మరియు వృత్తియందు శ్రద్ధ హెచ్చినకొలది నిపుణత యభివృద్ధిగాంచుటకు వీరిలో పెక్కురు అటుపిమ్మటకూడ ఆ యా విషయములందు జ్ఞానసముపార్జన చేయుచునే యందురని మా సంకల్పము. ఈ శిక్షణ నొసగుటయందు మా యుద్దేశ్యము ఏవో కొన్ని విద్యలయందు అనుభవ సహిత పాండిత్యము కలిగించుట గాక విద్యను గురించి సరియైన దృక్పథమును సంఘసేవానిరతిని కలిగి తెలివితేటలతో తమవృత్తులను సాగించుటకు సర్వోదయులను తయారుచేయుటయే. ఇట్టివారే భావిసంతతికి మార్గదర్శులు కాగలరు.

## తాత్కాలిక సంవత్సర శిక్షణము

సాధ్యమైనంత త్వరలో నీ విధానము ప్రారంభించుటకుగాను ప్రస్తుత పాఠశాలలలోను ఆశ్రమములలోను జాతీయసంస్థలలోను పనిచేయువారిని కొందఱిని ఏరి వారికి తాత్కాలికముగా నొక సంవత్సర శిక్షణ మీయదగు నని సూచించుచున్నాము. ఇటుల నైకొనబడినవారు బోధనయందుగాని ఏదేని పరిశ్రమయందు గాని నిపుణులుగాను ఈ నూతన విధానము నమలు జరుపుటకు నుత్సాహభరితులుగాను ఉండవలెను. ఒక్కొక్కరాష్ట్రమునందును ప్రారంభింపదలచు పాఠశాలలను బట్టి వీరి సంఖ్యను నిశ్చయించుకొనవచ్చును. వీని కీ దిగువ విషయములను బోధించవలెను.

1. ఏ పరిశ్రమ తీసికొన్నను కూడ అగత్యముగా ఏకుట, తక్లీవడుకుట నేర్పవలెను.

2. పైన పేర్కొనబడిన ప్రధానపరిశ్రమలలో నొకదానియందైన విద్యార్థులకు 3 వత్సరముల కాలము నేర్పగలుగు ప్రావీణ్యత సంపాదించుట.

3. శరీరశాస్త్రము, ఆరోగ్య, పారిశుద్ధ్య, ఆహార నియమములను గూర్చి సంగ్రహముగా బోధించుట.

4. చేతిపనులపై నాధారపడు పాఠశాలతత్వము, ఈ పాఠశాలలకును సంఘమునకును గల సంబంధమును గూర్చి బోధించుట.

5. బోధన కనుగుణముగా సాంఘికసేవాకార్యములు కొలదిగా ప్రారంభించి సాగించుట.

6. సంగ్రహముగా భారతజాతీయోద్యమచరిత్రయు ఈ శతాబ్దపు ప్రపంచోద్యమ చరిత్రలును బోధించుట.

7. తగిన అజమాయిషీక్రింద మొదటి స్కూలునందు కనీసము 25 పాఠము లైనను బోధించియుండును.

## 4. శిక్షణ—తనిఖీ, పరీక్షలు

## బాలబాలికలకు ఏడవ వత్సరము నుండి నిర్బంధవిద్య

### తనిఖీ

ఈ నూతన విద్యాలయములందు సమర్థులగు నుపాధ్యాయుల వలెనే ప్రతిభా వంతులును సానుభూతి కలవారును నగు తనిఖీదార్లుకూడ అగత్యము. తగిన అజమాయిషీ ప్రత్యేకకృషి మరియు అనుదినాభివృద్ధిగాంచు పాఠశాలలతోపాటు తనిఖీదార్లసంఖ్యకూడ పెంచవలెననియు మేము కోరుచున్నాము సూపర్వైజరుగ నుండువాడు ఉపాధ్యాయపదమును బడసినవాడై కనీసము 2 వత్సరముల బోధనానుభవమును, ఒక సంవత్సరము స్కూళ్ళ అజమాయిషీ, నిర్వాహణానుభవమును గలిగియుండవలెను. కేవలము తనిఖీచేయుటేగాక తనకన్న తక్కువ అనుభవ సామర్థ్యములు గల తోడి యుపాధ్యాయునకు సహకారభావముతో తోడ్పడుచుండవలెను. సూపర్వైజర్లు ఈ నూతన విద్యావిధానమును అమలుజరుపుటలో నాయకులుగాను, మార్గదర్శులుగాను ముందడుగు వేయవలెను. ఇట్లు వీరు చేయగలుగుటకుగాను వీరు చేయవలసిన ఆఫీసుకార్యములను వీలైనంత తగ్గించవలెను. వీరు తనిఖీచేయవలసిన ప్రదేశములు కూడ పరిమితముగా నుండవలెను. ఇందువలన వ్యయము హెచ్చినను విచారించవలసినది కాదు.

### పరీక్షలు

ప్రస్తుతము మనదేశమునందు అమలులోనున్న పరీక్షలపద్ధతి విద్యకు వేరుపురుగైనది. అసలు ప్రస్తుతవిద్యావిధానమే లోపభూయిష్ఠమైయుండ నీ పరీక్షాపద్ధతి దానిని మరింత యధ్వాన్నమొనర్చినది. వ్యక్తులు గాని, సంస్థలుగాని చేయుపనికి ఈ పరీక్షలు సరియైన తనిఖీ కావని విద్యావేత్తల యభిప్రాయము. అందువలన నీ పద్ధతి మేము సూచించిన జాతీయవిద్యావిధానమునందు అవకాశము లేకుండునట్లు కట్టుదిట్టములు చేయుచున్నాము.

ఎడ్యుకేషనలుబోర్డువారిచే నియమింపబడు తనిఖీదార్లు పాఠ్యక్రమనిర్ణయాధికారుల సహాతో నిర్ణీతప్రదేశములందు జట్లుగా విద్యార్థులను తనిఖీచేయుచుండవలెను.

ఈ విధానము సావధానమైనదిగాను 7 సంవత్సరములలో బాలబాలికలు నేర్చుకొనిన విషయములను పరీక్షించు సావకాశము గలదిగాను ఉండును.

ఈ విధమైన తణిఖీవలన విద్యార్థులకు వాస్తవమైన లాభము కలుగును. ప్రస్తుతము పరీక్షలకు ముందు తిరిగి పాఠములు చదువుకొనుట కీయబడిన తన్మూలమున వ్యర్థమగుచున్న 6 వారముల వ్యవధియుకూడ నీ పద్ధతి క్రింద ఇంకను నూతన విషయములు నేర్చుకొనుటకును, పరిశ్రమయందు నైపుణ్య మలవడుటకును అ స్కూలు గల గ్రామవాసుల కధికసేవ యొనర్చుటకును ఉపయోగపడగలదు.

క్రింది తరగతినుండి పైతరగతికి విద్యార్థిని పంపుపద్ధతి బాలుర సంవత్సరము పొడుగునను చేయు పనినిబట్టి నియమించబడవలెను. అన్ని స్కూళ్ళయందును ఒకేమాదిరి ప్రావీణ్యము బాలబాలికలకు అలవడుచున్నదో లేదో చూచుటకుగాను ఎడ్యుకేషనలు బోర్డువారు ఒక్కొక్క సంవత్సరమునను వివిధభాగములందలి యొకే తరగతి విద్యార్థులను పరీక్షించి కనుగొనుచుండవలెను. ఒకతరగతియందు పెక్కురు విద్యార్థులు కృతార్థులు కానిచో లోపము ఉపాధ్యాయునిదిగాను ఒకే పాఠశాలయందు పెక్కుమంది విఫలులైనచో నాలోపము స్కూలునకు సంబంధించినదిగాను చూడవలెను. పెక్కు స్కూళ్ల ఇట్టి లోపము చూపునెడల అందులకు పాఠ్యవిధానమే లోప మని భావింపవలసియుండును. ఒక తరగతిలో చెప్పబడిన విషయము సాధ్యమైనంతవరకు తిరిగి చెప్పకుండునట్లు శ్రద్ధవహించవలెను.

పైసూచనల ప్రకారము వృత్తివిద్యలయందు విద్యార్థులుచూపు నిపుణతను బట్టియు బాలురను, ఉపాధ్యాయులును తమ గ్రామజీవితమును బాగుచేయుట కొనర్చిన కృషిని బట్టియుఎడ్యుకేషనలుకౌన్సిలువారుపాఠశాలల శ్రేష్ఠత్వమునునిర్ణయించు చుండవలెను.

సంవత్సరమున కొక్కసారి ప్రతి జిల్లాయందును ఆ యా స్కూళ్లు చేసిన పనిని ప్రదర్శించి పోటీలు ఏర్పాటుచేయుటవలనకూడ స్కూళ్ళయందు అభివృద్ధి కావచ్చుగలదు.

## విద్యాలయముల నిర్వహణము

1. మేము సూచించిన యాదర్శముల ప్రకారము విద్య నేర్చుకొనుటకు బాలబాలికలకు 7 వత్సరములు పట్టును. చాల జాగ్రత్తగా యోచించి బాలబాలికలకు 7 వ ఏటినుండియు విద్య నిర్బంధముచేయ దగునని మేము నిశ్చయించితిమి. ప్రధానవిద్య బాలబాలికల కొకేవిధముగా నుండదగు నని మేము తీర్మానించియుండుటచే ఉభయులకును 7 వత్సరములనుండి 14 వత్సరములవరకును విద్య నిర్బంధముగాను

ఉచితముగాను ఉండవలెనని కోరుచున్నాము. అయితే బాలికల పెద్దలు కోరునెడల వారికి 12 సంవత్సరములు దాటిన పిమ్మట బడి మాన్పించుటకు అవకాశ మిచ్చు చున్నాము.

2. బాలబాలికలను బడికి పంపవగు వయస్సు 7 సంవత్సరములని నియమించు టలో శిశుశిక్షణమునందు చాల ముఖ్యమైన భాగమును మిక్కిలి అసంతృప్తికర మైన పరిస్థితులందును, విద్యాహీనులను పొట్టకూటికి పాటుపడుటతోనే కాలమంతయు గడపుచు తమ బిడ్డలనుగూర్చి భారము వహించనివారును నగు తలి దండ్రులతోను గడప నిచ్చుచున్నా మను విషయమును మేము గమనించక పోలేదు. ఈ వయసునందు (3 సంవత్సరములనుండి 7 సంవత్సరములు వచ్చువరకు) బిడ్డల యభ్యుదయముకొరకు పనిచేయగల సంస్థలు స్వతంత్రముగాగాని ప్రభుత్వసహాయ ముతోగాని నడుపబడవలె నని మేము గాఢముగా వాంఛించుచున్నాము. ఇప్పటి స్థితి గతులను, అందును విశేషించి యార్థికస్థితిగతులను గుర్తించి ప్రస్తుతము మే మీ శిఫా రసు చేయకున్నను ప్రభుత్వ మావిషయమున నుపేక్ష వహించకుండునుగాక యని హెచ్చరించుచున్నాము. మేము ప్రతిపాదించిన విద్యావిధానము ఆచరణలోనికి రాగానే బడికి పంపబడుటకు ముందుసైతము బిడ్డలకు ఇండ్లయందు ఇప్పటికంటెసరి యైనశిక్షణము లభింపగలదని ఆశించుచున్నాము. త్వరలోనే మనము పూనుకొన వలసిన ప్రయోజన విద్యావ్యాప్తికిసైతము మీ విధానము మిక్కిలి యుపకరించగలదు.

3. అనుదినమును పాఠములకును, పరిశ్రమలకును ఈ దిగువ విధముగా కాల మును నిర్ణయింపవచ్చునని మేము తలచుచున్నాము.

| | | |
|---|---|---|
| ప్రధాన పరిశ్రమకు | 3 గంటల 20 | నిమిషములు |
| సంగీతము, లెక్కలు, చిత్రలేఖనము | 40 | " |
| మాతృభాష .... .... | 40 | " |
| సాంఘిక సాధారణ విద్యలు .... | 30 | " |
| శారీరిక శిక్షణ .... .... | 10 | " |
| విశ్రాంతి .... .... | 10 | " |
| వెరశి | 5 గంటల 30 | నిమిషములు |

ఈలెక్క వేయుటలో వడుకుట, నేయుట ప్రధాన పరిశ్రమగా తీసికొనబడినది. పరిశ్రమనుబట్టి యీ కాలము మారుచుండవచ్చును. కాని పరిశ్రమ కుపయోగించు కాల మెన్నటికిని పై వ్యవధిని మీరరాదు.

దామాషాను నెలకు 24 రోజుల చొప్పున పాఠశాల సంవత్సరమునందు 288 దినములు పనిచేయవలెను.

4. బిడ్డల యభిరుచులు భిన్నముగా నుండును గాన ప్రతిస్కూలు నందును వీలైనంతవరకు వివిధ పరిశ్రమలను నేర్పుచుండవలెను, ఈ పద్ధతి స్కూలు నందు కనీసము చివరి రెండు సంవత్సరములందైన నుండవలెను.

5. ప్రతి బడికిని చేరి ఆటస్థలముగాను, తోటగాను ఉపయోగించుటకు విశాలమైన ప్రదేశ ముండవలెను.

6. బాలబాలికలు చదువులో వెనుకబడియుండుటకు చాలవరకు కారణము వారికి తగిన యాహారము లేకపోవుటే యని పరిశోధకులు ఋజువుపఱచియున్నారు. ఇంచుమించు గ్రామవాసుల బిడ్డ లందరియందును నీ లోప ముండుటచే, ప్రతిస్కూలు నందును బాలబాలికలకు పుష్టికర పదార్థములను ఫలహారముగా నిచ్చుటకు కృషిచేయ వలె నని గట్టిగా హెచ్చరించుచున్నాము. ఇందువలన నగు నధికవ్యయమును ధరించుటకు ప్రజలతోపాటు ప్రభుత్వము సైతము సిద్ధపడు నని మా విశ్వాసము !

7. ఉపాధ్యాయుల జీతములను హెచ్చి గాంధీజీ యిచ్చిన సలహా ప్రకారము సాధ్యమగుచో రు 25 లు ను, కనీసము రు 20 లు ను ఉండదగునని మేము సూచించుచున్నాము. కాని పైతరగతులందు బోధించుటకు హెచ్చు యోగ్యతలు కల యుపాధ్యాయు లవసరమగుటచే వారికి మరికొంత హెచ్చుమొత్తము లీయవలసి యుండుననికూడ నమ్ముచున్నాము.

8. ఈ నూతన విధానము అమలుపరచు మొదటి 2, 3 వత్సరములలోను కొంచెము హెచ్చు వేతనము లిచ్చియైనను ప్రత్యేకసమర్థతలు గలవారినే ఎన్నుకొని నియమితములగు స్కూళ్ళయందు వారిచే క్రొత్తపద్ధతుల ప్రకారము పని చేయించవలెను. కష్టసాధ్యమగు నీ ప్రాథమికావస్థ దాటిన పిమ్మట 3 వత్సరముల కాలము శిక్షణ బడసిన సాధారణోపాధ్యాయులే యీ విధానమును తృప్తికరముగా నడుప గలుగుదురు.

9. ఏ తరగతి యందును విద్యార్థుల సంఖ్య ముప్పదిని మించి యుండరాదు. అంతకు మించిన సంఖ్యయున్నచో కష్టసాధ్యమగు తన పనిని ఉపాధ్యాయుడు సమర్థతో నిర్వహించలేడు.

10. ఉపాధ్యాయులను ఎన్నుకొనుటలో పాఠశాల యున్న ప్రాంతవాసుల కెక్కువ యవకాశ మీయవలెను.

11. ఈ వృత్తియందు స్త్రీలకు అభిరుచిని కలిగించుటకుగాను ఉపాధ్యాయ శిక్షణకు వారి కెక్కువ సదుపాయములు చూపవలెను.

12. ఉపాధ్యాయశిక్షణకు పంపువారిని జాగ్రత్తగా పరిశీలించి శ్రద్ధగా పరీక్షించి మాత్రమే ఎన్నుకొనవలెను. ఇందుల కొక నికరమైన పరీక్ష నేర్పరచవలెను. కష్టమైన యీ సమస్యపైననే యీ విధానముయొక్క విజయ మాధారపడియున్నది. ఉబలాటపడి యీ వృత్తియందు చేరగోరు ప్రతివాడును ఉపాధ్యాయుడు కాజాలడు. బోధించు నేర్పు కలిగి సాంఘికముగ కలసిమెలసి తిరుగ గలవారును ఉన్నతమైన నైతికప్రవర్తనగలవారును మాత్రమే యీ వృత్తి కర్హులు. కాన ఇట్టివారిని ఎన్నుకొనుటలో మనము హెచ్చుశ్రద్ధను దూరాలోచనను చూపి సాంఘికసేవాపరులగు వారిని మాత్రమే తీసికొనుచుండవలెను.

13. ఉపాధ్యాయుల బోధనాలయములందు భోజనవసతిగృహములును చేరియుండవలెను. వారియందు మతాంతర శాఖాంతర భేదములుగాని అస్పృశ్యతకు తావు గాని అంతర్భోజనముల కాటంకములుగాని యుండరాదు.

14. ఈ ట్రైనింగు విద్యాలయములయందు తరుచు విజ్ఞానసంబంధమైనట్టియు వృత్తులకు సంబంధించినట్టియు గోష్ఠులు, ఉపన్యాసములు జరుగుచుండవలెను. ఇందువలన ఉపాధ్యాయుల శ్రద్ధాసామర్థ్యములు హెచ్చగలవు.

15. ఈ విద్యాలయములందు వృత్తివిద్యలను నేర్పుటకు గృహపరిశ్రమలందు నిపుణులగువారిని నియోగింపవచ్చును. స్కూలునందు వృత్తివిద్యను నేర్పు నుపాధ్యాయులకు తోడ్పడుటకును బిడ్డలు తయారుచేసిన వస్తువులను విక్రయించుటకుగాను ఆయావస్తువులను సిద్ధపరచుటకును అవసరమగుచో గ్రామములోని ఆయావృత్తులవారి సహాయమును తీసికొనవచ్చును.

16. ప్రతిట్రైనింగుస్కూలునకును చేరి కొన్ని మాడల్‌స్కూళ్లుండవలెను. వీధియందు నూతన విధానమును సాకల్యముగా బోధించుట కవకాశములుండవలెను. ఇందు పనిచేయు నుపాధ్యాయులు ప్రత్యేకార్హతలు గలవారుగా నుండవలెను. ఈ స్కూళ్లు ఆ ప్రాంతమున కంతటికి నాదర్శముగా నడుపబడి యితర ప్రాంతములనుండి వచ్చు నుపాధ్యాయులు అందలి విద్యాపద్ధతులు, వృత్తులు నేర్చుకొనదగినట్లుగా నుండవలెను,

17. మేము సూచించిన యీ విధానమునందు ముఖ్యములగు వృత్తివిద్యలను ప్రవేశపెట్టుట, ఒక్కొక్కవిషయమునకును జీవితమునకును గల యన్యోన్యత, పని

చేయుట ద్వారా విద్య నేర్చుకొనుట, వ్యక్తిబాధ్యత, సంఘబాధ్యత మున్నగు విషయములను గూర్చి విద్యార్థులకు—ఉపాధ్యాయులకు—ముఖ్యముగా ఉపాధ్యాయులకు—బోధించదగిన పుస్తకములు నిచ్చినగాని ప్రయోజనము లేదు. అందులకుగాను ఈ విధానము పూర్తిగా బోధపడునట్లుపాధ్యాయులకు గ్రంథములను పాఠ్యకార్యక్రమమును మనము సిద్ధపఱచవలెను. నూతన భావములను ప్రజ్వరిల్లజేయు క్రొత్తపాఠ్య గ్రంథములు తయారు కావలెను. ప్రతిరాష్ట్రములోను రాష్ట్రీయవిద్యాబోర్డును జాతీయకేంద్ర విద్యాసంస్థయు (దీని నిర్మాణమును గూర్చి దిగువ చర్చింతుము) ఇందును గూర్చి హెచ్చుగా కృషి చేయగలవు. ఈ నూతన విధానము నమలుపరచ గోరు రాష్ట్రములు సాధ్యమైనంత త్వరలో నీ పాఠ్యగ్రంథములు వ్రాయించుట మొదలగు పనులను ప్రారంభించవలెను.

18. పరీక్షలను గూర్చి చర్చించునప్పుడు రాష్ట్రములోని రాష్ట్రీయ విద్యాబోర్డు ఆయా స్కూళ్ళయొక్క సమర్థతను పరీక్షించవలెనని తెలిపి యుంటిమి. ఒక్కొక్క రాష్ట్రమునందలి విద్యాబోర్డులును సమర్థులగు విద్యావేత్తలుండవలెను వీరు స్కూళ్ళయందు బోధింపబడు విధానము దేశీయుల జీవితమునందనుష్ఠింప వీలగునట్లును ఉపాధ్యాయులకు నూతన పద్ధతులను బోధించుటకును నిరంతరము పరిశోధనలు జరుపుచుండవలెను. మరియు వీరు సులువుగా బోధించు పద్ధతులను గూర్చియు ఈ దేశమునందును ఇతరదేశములందును గల విద్యావిధానములను గూర్చియు ఉపాధ్యాయులకు బోధించుచుండవలెను.

19. ప్రభుత్వమువారిచే నేర్పరుపబడినదిగాక తదితరులచే నిర్వహింపబడు కేంద్రవిద్యాసంస్థ యొకటి ఏర్పడవలెను. ఇందు విద్యారంగమునను ఇతర వైజ్ఞానిక విషయములందును ప్రసిద్ధులగువారందఱును సభ్యులుగా నుండవలెను. ఈసంస్థకు పాఠశాలల నిర్వహణముతో సంబంధ ముండ నక్కరలేదు. ఈ సంస్థ దిగువ యాదర్శములను గలిగి యుండవలెను.

(a) విద్యావిధానమును అనుష్ఠానమును నిర్ణయించుటలో సలహాసంఘముగా పని చేయుట.

(b) ఈ దేశమునందును ఇతరదేశములందును అనుష్ఠింపబడు విద్యావిధానము యొక్క భావములను ఆదర్శములను గ్రహించి బాగోగులు చర్చించుట; ఇందు గూర్చి తెలిసికొనగోరువారికి పరిశోధనల ఫలితము నందజేయుట.

(c) విద్యావిషయములందు మనదేశములోని వివిధరాష్ట్రములందును సంస్థానములందును పరదేశములందును, జరుగు విశేషములను సేకరించుచుండుట,

(d) విద్యకు సంబంధించిన సమస్యలనుగూర్చి పరిశోధనలు జరుపుచుండుట,

(e) జరిగిన పనిని నివేదికలద్వారా తెలుపుచుండుట. విద్యాప్రచారకుల కొఱకొక పత్రికను నడుపుట.

20. తమ భావిశాఖల యభివృద్ధియెడ శ్రద్ధను కనుపర్చవలసిన వివిధములైన మనదేశీయాభివృద్ధిశాఖలు దురదృష్టమువలన ప్రస్తుతము వేర్వేరుగా నున్నవి. ఇకముందు ప్రభుత్వముచే నడుపబడు ఆరోగ్యశాఖ, వ్యవసాయశాఖ, పల్లెకువర్తక శాఖ, సహకారశాఖ, స్థానికస్వపరిపాలనాశాఖ మున్నగు నన్నిశాఖల సహకారమును విద్యాశాఖ పొందుచుండవలెనని, దీని ఫలితముగా ఆరోగ్యవంతులు సమర్థులు సంతోషవంతులు నగు పౌరులు తయారు కాగలరని నమ్ముచున్నాము.

## 5. శిక్షను

రాట్నము, మగ్గము, ప్రధాన పరిశ్రమగా ఏడుసంవత్సరముల ప్రణాళిక

1. ఈ విధానము క్రింద వడుకుట వేరుగాను నేత వేరుగాను నేర్పబడును.

2. మొదటి 5 సంవత్సరములలోను వడుకుటయు మిగత 2 సంవత్సరములలోను స్వల్పముగా కమ్మరము వడ్రంగముతో సహా నేతయు నేర్పబడును.

3. బాలుని యభివృద్ధి సక్రమముగా నుండుటకుగాను ప్రతి సంవత్సరమును రెండు భాగములుగా విభజింపబడును.

4. ప్రత్తిని శుభ్రపఱచుటయు, గింజలుతీయుటయు, బాలబాలికలకు నేర్పుటకు మాత్రమే స్కూళ్ళలో ప్రవేశ పెట్టవలెను. పైరెండుపద్ధతులను చూపుటకు కావలసిన ప్రత్తిగాక మిగతాస్కూళ్ళకు కావలసినదంతయు ప్రత్తిగింజకలమీద తయారైనదూదియైయుండవలెను. ఈ దూదిని దీయుట నుపయోగించు ప్రత్తి ఆకు, చెదపురుగు లేకుండ ఏరబడినదై యుండవలెను.

5. పైతరగతుల విద్యార్థులు ప్రారంభతరగతులవారికి ఏకులు చేసి యిచ్చుచుండవలెను.

6. పిల్లలు తక్లీమీదగాని రాటముమీదగాని వడుకుచున్నప్పుడు తెగుట వస్త్రైరాల వల్ల పోగు నష్టపడకుండునట్లు ఉపాధ్యాయులు ప్రారంభమునుండియు శ్రద్ధ వహించ

వలెను. నూలు ధరలో నూటికి 5 పాళ్ళు ఏకుడుపోరు, 5 పాళ్లు వడుకుపోరును కలిసి 10 పాళ్ళకంటె ఎన్నడును ఈ తరుగు మించరాదు.

**7.** నూలునెంబరు 8 నుండి 12 లోపుగా నున్నప్పుడు రోజియం రకం దూది కంటె తక్కువనాణ్యం దూదిని వాడరాదు. 13 నెంబరు పైబడిన నూలు తయారగునప్పుడు పొడుగు పీసుగల వెరం. సురటి, కంబోడియా, జయవంతి, పంజాబు. అమెరికాలవంటి ప్రత్తిని మాత్రమే వాడవలెను

8 పరిశ్రమకొఱకు ప్రతిదినమును 3 గంటల 20 నిమిషములు మాత్రమే వినియోగింపవలెను. దామాషాను నెలకు 24 రోజుల చొ॥ సాలునకు 288 దినములు పనిచేయవలెను.

**9.** వరుసగా 3 గంటల 20 నిమిషములసేపు వడికిన నూలు వేగమే దామాషా వేగము క్రింద లెక్కించబడును. ప్రతి ఆరుమాసముల యనంతరమును ఈ 3 గంటల 20 నిమిషముల సేపునుంచి వడికిన వేగము నిర్ణయించబడును.

10. మొత్తము రావలసిన నూలు దిగుబడినుండి జబ్బులవల్లను ఇతర కారణముల వల్లను హాజరుకాని వారికిఁంద నూటికి 25 పాళ్లు ఉత్పత్తి తగ్గించి లెక్కవేయబడును.

### ప్రథమ సంవత్సరము——మొదటి అర్ధభాగము : వడుకుపని

1. ఈ కాలమునందు దిగువపద్ధతు లన్నియు బోధించవలెను.

అ. ప్రత్తిని శుభ్రపరచుట.

ఆ. ఏకిన దూదినుండి ఏకులు చేయుట.

ఇ. తక్లీని కుడిచేతితో వడుకుట, వ్రేళ్లతోవడుకుట, తక్లీని పిక్కకు ఆనించియు తొడకు ఆనించియు వడుకుట.

ఈ తక్లీని ఎడమచేతితో (కుడిచేత పురి యుండునట్లు) వడుకుట, వ్రేళ్లతోను పిక్క నానించియు తొడల నానించియు వడుకు పద్ధతులు.

ఉ. ఆసు పోయుట.

**2.** తక్లీని ఎడమ కుడి చేతులలో మార్చి మార్చి వడుకుట.

3. 6 మాసముల యనంతరము వేగము పరీక్షించగా 3 గంటలలో 10 నెంబరునూలు $1\frac{1}{2}$ లడ్డీలు (160 చుట్లుగల చిలప) వడుక గలిగి యుండవలెను. ఆసుపోయుట కూడ ఈ వ్యవధిలోనే ముగియవలెను.

4. ఆఱుమాసములలోను రోజుకు 10 నెంబరునూలు $\frac{3}{4}$ లడ్డీ చొ॥ తయారు కావలెను. మొత్తం 6 మాసములలోను పని జరుగు 145 రోజులలోను 640 చుట్లుగల 27 చిలపలు తయారగును. వీని తూకం 1 శేరు అర్ధ పావు, ఏకుడు కూలిగాక శేరుకు రు 0-12-0 చొ॥ నీ నూలు రు 1-0-6 కూలి గిట్టును.

## రెండవ అర్ధభాగము

1. ఈ భాగమున ఏకుడు నేర్పవలెను.

2. ఆఱుమాసముల యనంతరము ఏకులు చేయుట సహా గంటకు $2\frac{1}{2}$ తులముల దూదిని ఏకగలిగి యుండవలెను.

3. ఈ యాఱుమాసముల యనంతరము తక్లీమీద మూడు గంటలలో 10 నెంబరు నూలు 2 లడ్డీలు వడుక గలిగి యుండవలెను.

4. ఈ కాలమున వామాషాను ఏకుటతోసహా ప్రతిదినమును 3 గంటలలో 10 నెంబరు నూలు $1\frac{1}{4}$ లడ్డీల చొ॥ 45 చిలపలు తయారుకావలెను. ($2\frac{1}{4}$ శేర్ల తూకం) శేరుకు రు 1-6-0 చొ॥ (ఏకుడుకూలిసహా) యీ నూలుకు కూలి రు 2-8-6 వచ్చును.

## రెండవ సంవత్సరము—మొదటి అర్ధభాగము

1. ప్రత్తిని పట్టుట (గింజలు తీయుట) నేర్పవలెను.

2. ప్రారంభమున నొక పీటమీద యినుపచువ్వతో గింజలు తీయు పద్ధతి నేర్పవలెను. అర్ధగంటకు 1 చటాకు ప్రత్తిగింజలు తీయు నేర్పు అలవడిన పిమ్మట ప్రత్తి రాటముమీద గింజలు తీయు పద్ధతి ప్రవేశపెట్టవలెను.

3. 6 మాసముల యనంతర మీ గిలకమీద $\frac{1}{2}$ గంటకు 10 తులముల ప్రత్తిని గింజలుతీయు నేర్పలవడవలెను.

4. మరియు నీ వ్యవధి పూర్తియగులోపల ఏకులు చేయుటతోసహా గంటకు తులముల దూదిని ఏకుటయు మూడు గంటలలో తక్లీమీద 10 నెంబరు గల 2 లడ్డీలు నూలు వడుక గలిగియు నుండవలెను.

5. ఈ కాలమున వామాషాను ఏకుటతోసహా చేరి రోజుకు 3 గంటలలోను 1 నెంబరు గలనూలు $1\frac{3}{4}$ లడ్డీలు వడుకగలిగియుండవలెను. మొత్తము ఈ రోజులలో 2 శేర్ల 10 చటాకుల తూకము గల 63 లడ్డీల నూలు తయారగును. ఏకు

టతోసహా శేరు 1కి రు 1-6-0 చొ॥ నూలుకూలి రు 3-9-9 లును ప్రత్తిపట్టిన కూలి రు 0-4-0 ను చేరి మొత్తం రు 3-13-9 లు గిట్టును.

## రెండవ అర్ధభాగము

1. ఈ కాలమున విద్యార్థులు 2 చక్రములుగల ఎఱ్ఱవాడ చరఖాతో వడుకగలిగి యుండవలెను.

2. క్రమముగా నీ రాటము పైన ఎడమ కుడి చేతులతో వడుక గలుగవలెను.

3. ఈవ్యవధిలోగా ఏకులుచేయుటతోసహా గంటకు $3\frac{1}{2}$ తులముల దూదిని ఏక గలిగియు తక్లీమీద అసుపోయుటతోసహా 3 గంటలలో 12 నెంబరునూలు $2\frac{1}{4}$ లడ్డీలును, రాటముమీద అసు పోయుటతోసహా యిదే కాలమున 16 నెంబరునూలు $3\frac{3}{4}$ లడ్డీలును వడుక గలిగియు నుండవలెను.

4. ఈ కాలముననే వారికి నూలునెంబరు కట్టుపద్ధతిని నేర్పవలెను.

5. ఈ సమయమున వారు దామాషాను రోజుకు 14 నెంబరునూలు $2\frac{1}{2}$ లడ్డీల చొ॥ మొత్తము 90 చిలపలు తయారు చేయుదురు. శేరుకు రు. 1-6-0 చొ॥ వడుకు కూలియు ప్రత్తినిపట్టినకూలి రు0-4-0 ను చేరి మొత్తం ఆదాయము రు 5-7-6

## మూడవ సంవత్సరము—ప్రథమ అర్ధభాగము

1. ఈకాలమున బాలబాలికలకు వివిధరకముల ప్రత్తినిగుర్తించుటయు ఒక్కొక రకముయొక్క ఏసుపోతపును కొలుచుటయు ఏయేరకములనుండి ఎంతెంత నెంబరు గల నూలు తయారగునదియు నేర్పవలెను.

2. ఈ వ్యవధి యనంతరము ప్రతి విద్యార్థియు ఏకులు చేయుటసహా గంటకు 4 తులముల దూదిని ఏకుటయు,తక్లీ మీదనైనచో అసుపోయుటతోసహా 3 గంటలలో 12 నెంబరు గల నూలు $2\frac{1}{2}$ లడ్డీలును, రాటముమీదనైనచో అదే వ్యవధిలో 20 నెంబరునూలు $3\frac{3}{4}$ లడ్డీలును వడుక గలిగియు నుండవలెను. (అసుపోతతోసహా)

3. రోజుకు 20 నెంబరు నూలు $2\frac{1}{2}$ లడ్డీల దామాషాను ఈ యాఱుమాసము లలోను $2\frac{1}{4}$ శేర్లు తూకం గల 90 చిలపలు తయారై శేరుకు రు 2-4-0 చొ॥ రు 5-1-0 మజూరి గిట్టును.

## రెండవ అర్ధభాగము

1. ఈ వ్యవధి యనంతరము తక్లీ మీద వేగము 3 గంటలలో ఆసుపోయుట సహా 12 నెంబరు నూలు $2\frac{3}{4}$ లడ్డీలును రాటముమీద 20 నెంబరునూలు $4\frac{1}{2}$ లడ్డీలను వడుక గలుగునట్లు పెంపొందవలెను.

2. దామాషాను రోజున ఏకుటసహా 20 నెంబరునూలు $3\frac{1}{4}$ లడ్డీల చొ॥ మొత్తము 2 శేర్ల $14\frac{1}{2}$ చటాకుల తూకము గల 117 లడ్డీలు తయారై యిందులకు శేరుకు రు 2-4-0 చొ॥ మజూరీ రు 6-8-9 గిట్టగలదు.

## నాల్గవ సంవత్సరము—మొదటి యర్ధభాగము

1. ఈ కాలమున విద్యార్థులు ఈదిగువ విషయములన్నిటిని నేర్చుకొనవలెను.
   (*a*) నూలు యొక్క పురిని, సాఫీని తెలిసికొనుట.
   (*b*) వేగమును నిర్ణయించుట.

2. మరియు ప్రత్తి రాటమును ఏకుడు కమాను సు బాగుచేయుట నేర్చుకొనవలెను.

3. ఈ వ్యవధి పూర్తి యగుసరికి రాటముమీద ఆసు పోయుటతో సహా 24 నెంబరు నూలు $4\frac{1}{2}$ లడ్డీలు వడుక గల వేగ మలవరచుకొనవలెను.

4. దామాషాను రోజుకు (3 గంటల 20 నిముసములలో) ఏకుటతో చేరి 24 నెంబరు నూలు $3\frac{1}{2}$ లడ్డీలు చొ॥ మొత్తము 2 శేర్ల 10 చటాకుల తూకము గల 126 చిలపల నూలు తయారై శేరుకు 2-14-0 చొ॥ మజూరి రు 7-8-9 గిట్టుబాటగును.

## రెండవ అర్ధభాగము

1. ఈ కాలమున వీరు ఎఱ్ఱవాడ చరఖాయొక్క వివిధభాగములను తెలిసికొని వానిని బాగుచేయుటయు వెదురుముక్కలతో తక్లీలను చేయుటయు నేర్వవలెను.

2. మరియు నీ కాలము గడచు సరికి వీరు తక్లీమీద ఆసుపోతతోసహా 3 గంటలలో 14 నెంబరునూలు 3 లడ్డీలును, రాటముమీద అదే కాలములో 28 నెంబరు నూలు 5 లడ్డీలును వడుకుట నేర్చియుండవలెను.

3. దినమునకు 3 గంటలలో దామాషాను ఏకుటసహా 28 నెంబరునూలు $3\frac{1}{2}$ లడ్డీల చొ॥ మొత్తము యీ ఆరుమాసములలోను $2\frac{1}{4}$ శేర్ల తూకము గల 126 చిలపలు తయారై శేరు రు 3-10-0 చొ॥ వెరశి రు 8-2-6 కూలి గిట్టగలదు.

## ఐదవ సంవత్సరము—మొదటి భాగము

1. ఈ సమయమున విద్యార్థులకు ఆంధ్రపద్ధతిని (బహుశః శ్రీకాకుళం కేంద్రము పద్ధతిని) ప్రత్తి పట్టుట ఏకుటయు, 40 నెంబరు వఱకు నూలు వడుకుటయు నేర్పవలెను. కాని వడుకుట ఎఱ్ఱవాడ చరఖామీదనే సాగించవలెను. మగన్ చరఖామీద వడుకుటకూడ యీ కాలముననే నేర్పవలెను.

2. ఈ యాఱుమాసముల యనంతరము ఎఱ్ఱవాడ చరఖామీద ఆసుపోయుటతో సహా 2 గంటలలో 40 నెంబరునూలు 2 లడ్డీలును, మగన్ చరఖామీద 24 నెంబరునూలు ఆసుపోతతో చేరి గంటలో $2\frac{1}{2}$ లడ్డీలును వడుక గలుగవలెను.

3. ఈ కాలమున దామాషాను దినమునకు ప్రత్తిగింజలు తీయుట, ఏకుట చేరి ఎఱ్ఱవాడ చరఖామీద 3 గంటల వ్యవధిలో 40 నెంబరునూలు $1\frac{1}{4}$ లడ్డీలును, మగన్ చరఖామీద అదే వ్యవధిలో ఏకుటచేరి 24 నెంబరునూలు $1\frac{1}{2}$ లడ్డీలును వడుక గలిగియుండవలెను.

4. మొత్తమీ యారుమాసములలోను 40 నెంబరునూలు 45 చిలపలును (తూకం $\frac{1}{2}$ శేరు 1 చటాకు) 24 నెంబరునూలు 54 చిలపలును (1 శేరు 2 చటాకులు) తయారై 40 నెంబరు నూలుకు శేరు 1కి రు 6-4-0చొ॥ రు 3-8-3 లును 24 నంబరునూలు శేరు 1కి రు 2-14-0 చొ॥ రు 3-3-9 లును చేరి రు 6-12-0 మజూరి గిట్టగలదు.

## అయిదవ సంవత్సరము—కడపటి భాగము

1. ఈకాలమున విద్యార్థులకు 60 నెంబరునూలు వడుకు కౌశలమును ఒక గజము గుడ్డ నేతలో ఎంతనూలు పట్టునదియు, ఒక్కొక్క నెంబరు నూలునకు ఎంత పురి పెట్టవలసినదియు, రాట్నచక్రమునకును కదురుదిండుకొలతకును నుండవలసిన సంబంధము వగైరా విషయములను బోధించవలెను.

2. మఱియు నీ సమయముననే కదురు నెట్లు బిగించవలసినదియు ఎఱ్ఱవాడ, సావలీ, మగన్ చరఖాలవంటి వివిధరకముల రాటముల బాగోగులను గూర్చియు బోధించవలెను.

3. ఈ సంవత్సరాంతమునకు తక్లీమీద ఆసుపోయుటతో సహా 3 గంటలలో 16 నంబరునూలు 3 లడ్డీలును రాట్నముమీద ప్రత్తి గింజలు తీయుట ఏకుట సహా

60 నెంబరు నూలైనచో 2 గంటలలో 2 లడ్డీలను. 28 నెంబరు నూలైనచో (ప్రత్తి పట్టుట మినహాగా) గంటకో 3 లడ్డీలను వడుకగలిగి యుండవలెను.

4 దినమునకు 60 నెంబరునూలు $1\frac{1}{4}$ లడ్డీలును 28 నెంబరునూలు 2 లడ్డీల చొప్పున, 45 చిలపలు 60 నెంబరులోను, 72 చిలపలు 28 నెంబరులోను నూలు తయారై మొత్తము రు 8-13-9 లు మజూరి గిట్టును.

ఐదు ఏండ్లలోను ఒక్కొక్క విద్యార్థియు సంపాదించు నాదాయము

| | | | |
|---|---|---|---|
| మొదటి | సంవత్సరము | రు | 3- 9-0 |
| రెండవ | ,, | | 9- 5-3 |
| మూడవ | ,, | | 11- 9-9 |
| నాల్గవ | ,, | | 15-11-3 |
| ఐదవ | ,, | | 15- 9-9 |

ఐదు వత్సరముల ఆదాయము మొత్తం రు 55-13-0

ఇందులో పైన సూచించిన ప్రకారము గైరుహాజర్ల క్రింద 4 వ వంతు మినహాయించినచో ఒక్కొక్క విద్యార్థిమీదను నికరాదాయము రు 41-13-9 లు మిగుల గలదు.

## 6. శిక్షణ

### నేతపని

1. నేతపని పెద్దదగుటచే రెండుసంవత్సరములలో నీ వృత్తిని విద్యార్థులకు పూర్తిగా బోధించుట అసాధ్యము. అందువలన నేతపనిలో రెండు విధముల శిక్షణలను ఏర్పరచుచున్నాము. ప్రతి స్కూలులోను ఈ రెండు తరగతు లుండవలెనని, విద్యార్థి కోరిన శాఖయందు తరిఫీదు చేయవలెనని కోరుచున్నాము. కాని ఏ తరగతిలో చేరినను కూడ 2 సంవత్సరములలో విద్యార్థికి నేతపని యొక్క ప్రధాన సూత్రములు మాత్రమే తెలియును. కాన, యీవృత్తినే యవలంబించగోరు విద్యార్థి 2 సంవత్సరముల యనంతరముకూడ శిక్షలను సాగించవలసి యుండును.

2. ఈ తరగతికి వచ్చు సరికి విద్యార్థికి 13, 14 సంవత్సరముల వయస్సే యుండును. ఈ కారణమును బట్టి కూడ నేతయొక్క ప్రాథమిక సూత్రములే నేర్ప తలపెట్టితిమి.

3. స్కూలునందు 5 సంవత్సరముల యనుభవము కలిగిన పిమ్మట విద్యార్థులకు రాట్నపరిశ్రమయందు ప్రావీణ్యాత యలవడియుండును. కాన కడపటి 2 వత్సరములలోను వడుకుట స్కూలు కార్యక్రమములో చేర్చలేదు. అంతమాత్రమున వారు వడుకుట విడువక, యింటివద్ద వడుకుచు, తాము వడికిన నూలును స్కూలులో ఇచ్చుచుండవలెను. ఆ నూలునకు సరియైన క్రయము రొక్కరూపమునగాని, వస్త్రరూపమునగాని వారికి ముట్టునట్లు పాఠశాలాధికారులు తగు ఏర్పాట్లు చేయవలెను.

## సాదా నేతలు

### మొదటి సంవత్సరము

1. వడుకుట వలెగాక నేతపరిశ్రమ భిన్నమైన దగుటచే ఈ పనికి సంవత్సరమంతయు ఒకటే కాలముగా నేర్పరచ బడెను.

2. మొదటి సంవత్సరము యీ దిగువ విషయములు బోధించవలెను :

అ. ఆసుపోయుట

ఆ. కండెలు పోయుట

ఇ. పోగులు అతుకుట

ఈ. పడుగు తోడుట. పడుగు చేయుట

ఉ. చేమగ్గము మీద జములు పడుగు నేయుట.

3. సంవత్సరాంత మగుసరికి పై పద్ధతుల యందు ఈ దిగువ వేగమును ప్రతి విద్యార్థియు సంపాదించి యుండవలెను.

అ. ఆసుతోడుట గంటలో 5 చిలపలు

ఆ. కండెలుపోయుట గంటలో 3 చిలపలు

ఇ పోగులు అతుకుట గంటలో $2\frac{1}{2}$ పుంజములు

ఈ. పడుగుపరచుట, పడుగుచేయుట } ఈ రెంటిని 3 గంటలలో చేయగల్గుట

ఉ తయారుగా నున్న కండెలతో నేత 3 గంటలలో 2 గజములు.

4. పై అన్ని పనులు చేసికొని ప్రతి విద్యార్థియు సాలుకు 108 గజములు నేయవలెను.

5. గ 10 ల తానుకు రు 0-12-6 చొ॥ మొత్తము రు 8-7-0 ల కూలి సంపాదించవలెను.

## రెండవ సంవత్సరము

1. ఈ సంవత్సరమున కూడ విద్యార్థి జముఖానడుగు నేయుట సాగించవలెను. మరియు దీనికితోడు హానీకూంబ్ (తేనెపట్టునేత) తువ్వాళ్లు, రంగు కోటింగులు నేయుట కూడ నేర్పవలెను.

2. ఈ కాలమున విద్యార్థి ఒక్కొక్క పుంజమునకును, ఏ నెంబరునూలువాడ వలసినదియు తెలిసికొనవలెను.

3. సంవత్సరాంతమున పరీక్షించినచో విద్యార్థి మరమగ్గము మీద కండెలు అందిచ్చినచో 3 గంటలలో $3\frac{1}{2}$ గజములు నేయగలిగి యుండవలెను.

4. ఈ సంవత్సరము మొత్తము మీద ప్రతి విద్యార్థియు 216 గజములు నేయవలెను. గ. 1కి 0-1-3 కూలిచొ॥ ప్రతివారును రు 16-14-0 లు సంపాదింతురు

### నేత వలన రెండు సంవత్సరములలో ఒక్కొక్క విద్యార్థి యొక్కయు నాదాయము

| | | | | |
|---|---|---|---|---|
| మొదటి సంవత్సరము | రు | 8 | 7 | 0 |
| రెండవ సంవత్సరము | రు | 16 | 14 | 0 |
| వెరశి | రు | 25 | 5 | 0 |

గైరుహాజర్లు వగైరాల క్రింద ఇందులో 4 వ వంతు తగ్గించినచో రెండు వత్సరములలోను నికరాదాయము రు 18-15-9 లు మిగులును.

## నవారు, తివాసీల నేత

### మొదటి సంవత్సరము

1. ఈ తరగతియందు దిగువ విషయములు విద్యార్థులకు నేర్పవలెను :

నూలు పురిపెట్టుట, త్రాడు పేనుట. పడుగు చేయుట ; నవారు, జంఖానాలు, వివిధరకములగు ఆసనములు వాతిసీలు నేయుట.

2. మొదటి సంవత్సరము సాదా, రంగు నవారులు, లేసులు, తెలుపు రంగు ఆసనములు నేయుటను నేర్పవలెను.

3. ఈ రకములకు ప్రస్తుతము వివిధరకముల కూలి సాదానేతల కంటె హెచ్చుగానే యీయబడుచున్నను ఆదాయము సికరముగా నుండుటకుగాను, మొదటి వత్సరము ప్రతివిద్యార్థియు సంపాదించు కూలి రు 7-8-6 లు గానే లెక్కకట్టితిమి.

## రెండవ సంవత్సరము

1. ఈ కాలమున విద్యార్థులకు రంగుజంఖానాలు, చివాసీలు నేయుట నేర్పవలెను. వీనిలో పెక్కు రకము లుండుటచే సంవత్సరమంతయు నీ రెండు రకములు నేయుటకే వినియోగింపబడును.

2. పైవిధముగానే యీ సంవత్సరము విద్యార్థి సంపాదించు కూలి కూడ సాదా నేతకు వలెనే రు 16-14-0 లని లెక్కకట్టితిమి.

### ఏడు సంవత్సరముల మొత్తము ఆదాయము

| | | | |
|---|---|---|---|
| వడుకుటవల్ల | ... | రు | 41-13-9 |
| నేతవల్ల | .... | | 18-15-9 |
| | వెరసి | రు | 60-13-6 |

ఉపాధ్యాయుని జీతము నెలకు రు 25 ల చొ॥ 7 సంవత్సరములకును అగు మొత్తము రు 2100 లలో ఒక్కొక్క ఉపాధ్యాయుడు 30 మంది విద్యార్థులకు బోధించు నని తీసికొన్నచో వారివల్ల ఆదాయము రు 1825 లు లభించును.

## మరికొన్ని సలహాలు

ఈ ప్రణాళికను మేము వీలైనంత వివరములతో నిచ్చినను ప్రారంభమగుటచే ఈ సూచనలనే తుదిగా భావించనక్కరలేదు. ఇంకను లాభకరమగు పెక్కు అభివృద్ధి సూచనలు చేర్పవచ్చును. ఈ దిగువ ముఖ్యవిషయములను గమనించవలెను:

1. ఈ స్కీము మామూలుగా నిర్ణయింపబడిన ఉపాధ్యాయుల నెలజీతము రు 25 లలో చాలభాగమును పరిష్కరించును.

2. మొత్తము పనిచేయు దినములలో 4 వ వంతు రోజులఆదాయముతగ్గించియే లెక్కలు తయారుచేయబడినవి.

3. పరిశ్రమను విద్యలో నొకభాగముగానేగాని ప్రత్యేకించి పరిశ్రమగా బోధింపకుండుటచే మామూలు పనివాడు చేయుదానికంటె తక్కువ వేగమే తీసికొనబడెను.

4. ఈ పరిశ్రమలకు కూలీల నేర్పరచుటలో అఖిలభారత చరఖాసంఘపు మహారాష్ట్రశాఖవారు ప్రస్తుత మిచ్చుచున్న కూలీలనే ఆధారముగ తీసికొంటిమి.

5. అందువల్ల విద్యార్థుల నికరాదాయము మేము సూచించిన దానికంటె హెచ్చునే గాని ఎంతమాత్రము తగ్గదు. ఒకవేళ తగ్గినచో నది బోధకుల

యొక్క గాని పరికరములయొక్క గాని లోపమై యుండి వెంటనే సవరింపవలసి యుండును.

6. ఈ పరిశ్రమలకు అవసరమైన దిగువ తెలిపిన పరికరములను విద్యార్థులు ఉత్సాహముతో వాడునట్లు చూడవలెను.

7. ఈ రెండు పరిశ్రమలలోను విద్యార్థి తగు నిపుణత యలవఱచుకొనెనా లేదా యని పరీక్షించుటకు రోజుకు 8 గంటల చొ॥ వీనియందు 2 మాసములలో నాతడు సంపాదించు నాదాయమును చూడవలెను. రోజుకు రు 0-4-0 చొ॥ 2 మాసములలోను రు 12 లు సంపాదించగలిగినచో నాతడు త్తీర్ణుడయ్యెనని నిర్ణయింపవచ్చును.

8. ఈ ప్రణాళిక వలన శిక్షణ పూర్తియైన ప్రతి విద్యార్థియు స్వయం పోషణ మొనర్చుకొనగల పౌరుడు కాగలడు.

9. మొదటి సంవత్సరము తక్లీమీద వడుకటను ప్రస్తుతముద్రిట్లునేర్పు పద్ధతిని మొత్తము విద్యార్థులందఱి చేతను ఏకకాలమున చేయించుచుండవలెను.

10. తకిలీమీదగాని రాటముమీదగాని నూలు వడుకుటతోబాటు సంగీతముకూడ నేర్పవలెను. ఇందువల్ల విద్యార్థులకు ఉల్లాసముకలిగి వడకు వేగము పెరుగగలదు.

11. ఈ ప్రణాళికను అమలులో నుంచు మొదటి 7 సంవత్సరములలో కంటె 2 వ ఏడుసంవత్సరములలో ఫలితములు హెచ్చు తృప్తికరముగా నుండగల వని ఆశించుచున్నాము.

12 గృహమునకు కొలదిగా నైన అర్థికముగా తోడ్పడుచున్నచో బాలురు 7 సంవత్సరముల పిమ్మట కూడ శిక్షణపొందుట కవకాశ ముండును. కాన వారు ఇంటివద్ద నూలువడుకుకొనుటకే తగిన ఏర్పాట్లు గావించి వారు తయారు చేయు నూలుకు తగిన ప్రతిఫలము ముట్టునట్లు స్కూలు అధికారులు శ్రద్ధ వహించవలె

## రాటపుశాఖకు కావలసిన పరికరములు

వడుకుటకు

| | |
|---|---|
| తక్లీ | 0-1-9 |
| ఆసు | 0-1-0 |
| తక్లీ డబ్బా | 0-2-0 |
| ఎఱ్ఱవాడ రాటము | 2-8-0 |

| | |
|---|---|
| రాటపు ఆసు | 0.2-0 |
| నూనెడబ్బా | 0-1-0 |
| చిల్లరలు | 0-1-3 |
| వెరశి రు | 3-1-1 |

ప్రత్తి పట్టుటకు

| | |
|---|---|
| కొయ్యపలక 4″×6″×1″ | 0-1-0 |
| ఇనుపచువ్వ | 0-4-0 |
| ప్రత్తిరాటము | 1.10-0 |
| చేపదవడ | 0-4-0 |
| వెరశి రు | 2-3.0 |

ఏకుటకు

| | |
|---|---|
| చిన్నకమాను | 0-8-0 |
| గూటి | 0-2-0 |
| ఏకులపీట | 0-4-0 |
| ఏకులపలక | 0-3-0 |
| ఏకులుచుట్టు గంటము | 0-1-0 |
| నరం వగైరా | 0-7.0 |
| చాప | 0-2.0 |
| శ్రీకాకుళం కమాను | 0-5-0 |
| వెరశి రు | 2-0-0 |

పనిముట్లు

| | |
|---|---|
| సుత్తి | 0-7-0 |
| ఇనుప దిమ్మ | 0-8-0 |
| ఆకురాయి | 1-0-0 |
| ఉలి | 0-9-0 |
| చిన్నరంపము | 0.8-0 |
| బాడిత | 1.0-0 |
| బెజ్జములువేయు పనిముట్లు | 2.12-0 |
| కత్తి | 0-4-0 |

| | |
|---|---|
| క త్తెర | 0-6-0 |
| మేకులులాగు పనిముట్టు | 0-6-0 |
| చిన్న తక్కెడ—1/16 తులమునుండి | |
| 2 తులముల రాళ్లతో సహా | 2-0-0 |
| పెద్ద త్రాసు—శేరువరకు రాళ్ళతో | 3-0-0 |
| వెరశి రు | 12-12-0 |

పరికరముల మొత్తపు క్రయము రు 20-0-0.

షరా:—పరికరముల దామాషాధరలను మేము తెలిపియుండుటచే వీని నికర ధరలలో స్వల్పవ్యత్యాసము లుండవచ్చును.

సాదానేతకు, నవారు తివాసీలనేతకు కావలసిన పరికరములు

నవారు నేతకు

| | |
|---|---|
| నూలు పురిపెట్టు రాటము | 1-8-0 |
| Heddles చట్రము | 0-8-0 |
| నాడి | 0-1-0 |
| వెరశి రు | 2-1-0 |

ఆసనములు....నేతకు

| | |
|---|---|
| Heddles చట్రము | 0-12-0 |
| .... ....... | 0-8-0 |
| కూర్చుండుటకు పైన కొయ్యలు వగైరా | 0-12-0 |
| వెరశి రు | 2-0-0 |

పడుగు తోడుకొనుటకు

| | |
|---|---|
| పంజె | 0-5-0 |
| ఆసుకోలు | 0-6-0 |
| రేకు దారపు బండ్లు | 0-12-0 |
| పడుగుతోడు చక్రం | 1-8-0 |
| పెద్ద ఆసు | 0-2-0 |
| బాల్చీలు | 0-7-0 |
| త్రాళ్లు వగైరా | 0-7-6 |
| వెరశి రు | 5-8-0 |

పడుగు చేయుటకు

| | |
|---|---|
| ఉకు కొయ్యలు | రు 3-4-0 |
| వెదురు బొంగులు | 0-8-0 |
| 2 కుంచెలు | 5-0-0 |
| | వెరశి రు 8-12-0 |

నేతకు

| | |
|---|---|
| పన్నెలు | 3-0-0 |
| చేమగ్గము | 1-8-0 |
| మరమగ్గము | 7-0-0 |
| దోనె | 1-8-0 |
| చేమగ్గపు నాడె | 0-4-0 |
| మరమగ్గపు నాడె | 0-8-0 |
| దుంగ | 2-8-0 |
| పడుగు చదునుచేయు సీసా | 0-12-0 |
| గజపుబద్ద | 0-3-0 |
| కొయ్యలు వగైరా | 1-0-0 |
| మేకులు వగైరా | 1-8-0 |
| | వెరశి రు 19-11-0 |

Heddles చట్రములు చేయుటకు

| | |
|---|---|
| చుట్టుపనిమట్టు | 1-0-0 |
| గుండ్రని కొయ్య, పిన్నులు | 0-4-0 |
| ఇతరములు | 0-12-0 |
| | వెరశి రు 2-0-0 |

ఇవి ఉజ్జాయింపుగా వేసిన ధర లగుటచే స్థలమునుబట్టి వీనిలో కొంచెము హెచ్చుతగ్గు లుండవచ్చును.

## వడుకుటకు, ఏకుటకు, నేయుటకు 7 తరగతులు (ఒక్కొక్క తరగతియందు 30 మంది విద్యార్థుల చొ॥) గల స్కూలునకు కావలసిన పరికరములు

| | | |
|---|---|---|
| 1. | 125 మడతరాటములు, ఒక్కొకటి రు 2-8-0 చొ॥ .... ... | రు 312-8-0 |
| 2. | 25 ఏకుడుసెట్లు, శ్రీకాకుళపు ఏకుడుబద్ద మినహాగా మిగతా పరికరములన్నిటితో రు1-11-0చొ॥ | 42-3-0 |
| 3. | 50 తక్లీలు, 50 ఆసులు జత రు 0-2-9 చొ॥ | 8-9-6 |
| 4. | 5 ప్రత్తిరాట్నములు ఒక్కొక్కటి 1-10-0 చొ॥ | 8-2-0 |
| 5. | 15 కొయ్యపలకలు, ఇత్తడిపిన్నులతో జత 1కి 0-5-0 చొ॥ | 4-11-0 |
| 6. | 5 మగన్ చరఖాలు, రు 6 చొ॥ | 30-0-0 |
| 7. | 5 సావిలీ చరఖాలు, ఒక్కొక్కటి రు 1-4-0 చొ॥ | 6-4-0 |
| 8. | వడ్రంగి పనిముట్లు | 25-0-0 |
| 9. | 20 మగ్గములు, పనిముట్లన్నిటితోసహా ఒక్కొక్కటి రు 25 ల చొ॥ | 500-0-0 |
| 10. | చిల్లరలకు | 62-10-6 |
| | వెరశి రు | 1000-0-0 |

షరా : ఈ ధరలు ఉజ్జాయింపుగా వేయబడినవి. మార్కెటు ధరలనుబట్టి వివిధజిల్లాలలో కొలదిగా భేదించవచ్చును.

## పైపనులు సాగించుటకు పెట్టుబడి

| | |
|---|---|
| ప్రత్తి, దూది నిల్వచేయుటకు | 300-0-0 |
| రాటములు వగైరా పరికరములు నిల్వచేయుటకు | 100-0-0 |
| ఏకులు, నేతకు కావలసిన సామగ్రి వగైరాకు | 100-0-0 |
| వెరశి రు | 500-0-0 |

## సింహావలోకనము

జాకీరుహూస్సేను కమిటీ రెండు రిపోర్టులను ప్రకటించినది. మొదటిది 1937 సం॥ డిశంబరునెలలోను, రెండవది 1938 సం॥ ఏప్రియలునెలలోను శ్రీ గాంధీ మహాత్మునకు నివేదింపబడెను. వార్ధావిద్యాసభయందు గావింపబడిన నాలుగు తీర్మానములలోను సూచింపబడిన విధానమును విస్పష్టముగను విపులముగను కమిటీవారు వివరించిరి. క్రొత్తపాఠశాలల విశిష్టత్వమును పరమావధిని తెల్లము చేసిరి. ఆపాఠశాలలలో పనిచేయుటకు ఉపాధ్యాయులు ఎట్టి స్వభావము గలవారుగ నుండవలయునో ఎట్టి శిక్షణమును బడవలయునో సూచించిరి. వారికి వలయు మూడు వత్సరముల పూర్ణశిక్షణాప్రణాళికను, ఒక వత్సరపు అవసరశిక్షణాప్రణాళికను గూడ నిర్ణయించిరి. వడుకుటను, నేయుటను ఆధార వృత్తిగా దీసికొని ఏడేండ్లు విద్య నెటుల నేర్పుటో అనుబంధమునందు వివరించిరి. అందుకు వలయు పరికరములను, వసతులను దెలుపుచు ఎంతెంత సొమ్ము వారి కవసరమగునో కూడ సూచించిరి. ఈ రిపోర్టులో గల వివరములు చాల విపులముగను విస్పష్టముగను నున్నను ప్రజలు సంశయముల దెలుపసాగిరి. అనేకములగు ఇతర విషయములను గూర్చి ప్రశ్నింప సాగిరి. విమర్శలకు అంతే లేదు. ఏ యితర రిపోర్టు గాని ఇంత గాఢమును, విపులము నగు పృథఃకరణమునకు లోనయి యుండలేదనవచ్చును.

## రెండవ జాకీరు కమిటీ రిపోర్టు

కాబట్టి కమిటీవారు మరల పనిపూని సర్వతోముఖ మగు రిపోర్టును రెండవసారి సిద్ధము చేసి యుండిరి. విమర్శనలకు సమాధానముల గూర్చిరి. సందేహములు బాపిరి. అనుష్ఠానమునకు దిగువారికి ఎన్నియో సదుపాయముల జూపిరి. మొదటి రిపోర్టులో సూచించి విడిచిపెట్టిన యంశములను విపులీకరించిరి. మూలాధార వృత్తివిద్యతో తక్కిన బోధనాంశములను అనుసంధానము గూర్చు టెట్లో తెలిపిరి. విద్యాప్రచారమున సాయపడగల ఉపాయముల నెన్నిటినో ఆ రిపోర్టునందు చేర్చిరి. అదివరకు అనుభవము లేమిచేతను నిదానముగ ఆలోచించక పోవుట చేతను నూతన విధాన మనుటతోడనే వెఱగుపడి పోవుటచేతను విషమ విమర్శనలకు దిగిన అనేకులు ఈ రిపోర్టును చూచిన పిమ్మట అభిమానులుగ మారిరి. తమ సంకుచితానుభావములచేతను, విశాలదృష్టియు పూర్వాపేక్షణము లేమిచేతను వార్ధావిధానము ఆచరణ యోగ్యము కాదని బల్లగ్రుద్ది వాదించిన ఉపాధ్యాయ బృందములు అత్యుత్సాహముతో నిప్పు డీ విధానమును ఆహ్వానించుచున్నవి.

ఈ రెండవ రిపోర్టులో వ్యవసాయము, వడుకుట నేయుట, వడ్రము కమ్మరము అను మూడు వృత్తివిద్యలను ఆధారవృత్తి విద్యలుగ దీసికొని విద్యాప్రణాళికను ఎట్లు సాగింపవచ్చునో వివరించి యున్నారు. వడుకుట నేయుటను ఆధారవృత్తిగా దీసికొని ఏడుతరగతులలో విద్య నేర్పు పాఠశాలకు భవనములు మొదలగునవి ఎంత విశాలముగ నుండ వలయునో ఎంత వ్యయమగునో తెలుపు అనుబంధ మొకటియు, విద్యార్థిని అధిష్ఠానమూర్తిగ దీసికొనియు వాని సహజచర్యలను ఆధారముగ చేసికొనియు వివిధబోధనాంశములకు పరస్పర సంబంధ మెటుల కూర్పవచ్చునో ఎటుల వాంఛితార్థవిద్యలను, కళలను, శాస్త్రములను, శిల్పములను నేర్పవచ్చునో తెలుపు మరొక అనుబంధపటమును ఈ రిపోర్టునందు చేర్పబడియున్నవి. హస్తము యొక్కయు ఇంద్రియముల యొక్కయు శిక్షణ ద్వారమున మెదడును, హృదయమును వికసింప జేయుటయు, పాఠశాల ద్వారమున సంఘసేవను నీశ్వర సేవకును మార్గము కల్పించుటయు ప్రధాన సూత్రములుగ దీసికొని ఈ విద్యావిధానము నిర్మింపబడినదని చెప్పవచ్చును. ఈ యెదుట నున్న అనుబంధ పటమును కొంచెము శ్రద్ధతో గమనించు నెడల ఈవిద్యావిధానము ఎంత సర్వాంగ సౌష్ఠవము గల సమగ్రప్రణాళికయో విశదము కాగలదు.



నరశరీర నిర్మాణావలోకనము
భాష
కళా ప్రదర్శనము
ఆహారము
వస్త్రము
ఇల్లు
ఉపకరణములు
కర్మప్రవృత్తి
భాష
మతము
ప్రకృతిం గూర్చిన కథలు, గీతములు
వాగ్రూప ప్రకటనము
వ్రాతతోడి ప్రకటనము
నాటకరచనము
గానము, చిత్రలేఖనము
లలిత కళలు. హస్తకర్మము
ఆరామకృషి, వ్యవసాయము
మాదిరివస్తువుల సంగ్రహణము
పరిశీలన యాత్రలు పర్యటనములు
పండుగలు
పశు, పక్షి, కీటకాదుల పెంచుట
ఆటలు
వ్యవసాయ కర్మ
వడుకుట, నేయుట
ఇటుక పనులు వడ్రంగము
వడ్రంగము, కమ్మరము
సాంఘిక సేవా నిర్మాణము
బడులు, పంచాయతులు, సహకారసంఘములు నిర్మించుట
జాతీయములును, మతసంబంధములు నగు ఉత్సవములు
పరిశీలనయాత్రలు, తీర్థయాత్రలు
లలిత కళలు, సంగీతము
వ్రాతల రూపమున భావ ప్రకటనము
వాగ్రూపప్రకటనము, వాదము. ఉపన్యాసము
సంఘశాస్త్రము

# తృతీయ పాదము

## వి వ ర ణ ము

## పరిశ్రమద్వారా విద్యనేర్పుటలో పరమార్థము

పరిశ్రమకును, విద్యకును గల సంబంధమును గూర్చియు, పరిశ్రమద్వారా విద్య నేర్పుటయొక్క అంతర్యమును గూర్చియు తమ మనసులోని యభిప్రాయమును మహాత్మాజీ యిటుల తెలుపుచున్నారు :—

నేను దక్షిణాఫ్రికానుండి వచ్చిన పిమ్మట నన్ను చూడ వచ్చిన యనేకమంది విద్యార్థులతోడి పరిచయమునుబట్టి చాలకాలము క్రిందటనే నేను ప్రస్తుత విద్యావిధానము యొక్క నిరుపయోగత్వమును, దీనిని మార్చవలసిన యావశ్యకతను గ్రహించితిని. అందువలన ఆశ్రమవిద్యాలయములో పరిశ్రమల నేర్పాటు చేసితిని. పరిశ్రమల శిక్షణమీద హెచ్చుశ్రద్ధచూపసాగితిని. దీని పర్యవసానముగ త్వరలోనే విద్యార్థులకు విసుగును, తమకు విద్య లోపమగుచున్న దను అసంతృప్తియు కలిగెను. కాని వారి యసంతృప్తి సరియైనదికాదు. ఏలయన సామాన్య స్కూళ్ళలో నేర్చుకొనుదానికంటె వారు హెచ్చువిద్యనే నేర్చియుండిరి. అయినను ఇందలి లోపమేమో యని దీర్ఘముగా యోచించి విద్య లోపించు పరిశ్రమను నేర్చుట కాక, పరిశ్రమ ద్వారా విద్య నేర్పవగు నను నభిప్రాయమునకు వచ్చితిని. అందువలన పరిశ్రమ విసుగు కలిగించునదికాక యానందదాయినియైన విద్య వికసించి నూతనార్థములో గోచరించును. కాంగ్రెసువారు మంత్రివర్గములు స్వీకరించగనే నా యభిప్రాయములు ప్రజల యెదుట నుంచుట కుత్సాహము కలిగెను. చాలమంది ఈ విధానమును హర్షించుట సంతోషమును గలిగించుచున్నది.

ఇంగ్లీషుభాషను నేర్చుకొనుటకును వల్లెవేయుటకును మన బాలబాలికలకు హెచ్చుకాలము పట్టుచుండుటయు, అప్పటికిని వారు ఉపాధ్యాయుడు చెప్పునది గ్రహించలేకపోవుటయు, తెసినదానిని స్వంతమాటలలో స్పష్టముగా చెప్పలేకపోవుటయు జరుగుచుండుటవల్లనే మనము ఆంగ్లభాషను విసర్జించగోరుచున్నాము. మరియు కేవల అశ్రద్ధవల్ల వారు మాతృభాషను మఱచుచున్నారు. ఈ రెండు అనర్థములను తొలగించుటకు వృత్తి విద్యా బోధనమే సాధనము.

స్కూలు ప్రారంభదినమున వచ్చిన విద్యార్థుల మన స్తత్వము. వారికి వ్రాతకూతలు భూగోళజ్ఞాన మెంతమాత్రమున్నదో తెలిసికొని తక్లీని వడకుటనేర్ప నారంభింతును.

పెక్కు పరిశ్రమ లుండగా తక్లీ నేల ప్రారంభించవలె నని మీరడుగ వచ్చును. కారణము తక్లీ యనాది సిద్ధముగా వచ్చుచున్న పరిశ్రమ యగుటయు, తొలుదొల్త మనచే నుద్ధరింపబడిన దగుటయు నై యున్నది. శతాబ్దముల క్రిందట మన గుడ్డకు వలయు నూలంతయు తక్లీమీదనే తయా రయ్యేడిది. చరఖా తరువాత వచ్చినది. అత్యధికమైన సన్ననూలుకు మరల తక్లీనే నాశ్రయింపవలసి వచ్చెడిది. తక్లీనిర్మాణము మానవుని యద్భుత ప్రజ్ఞకు నిదర్శన మయ్యెను. దీని వలన యంగుళుల నైపుణ్యమంతయు ప్రదర్శించ వీలయ్యెను. కాని తక్లీని వాడువారు విద్యాహీనులగుటచే దాని యాంతర్యమును వారు గ్రహించక విడిచిపెట్టిరి. పూర్వవైభవముతో నీ పరిశ్రమను మనము సాగించగోరునెడల గ్రామజీవితమును పునర్నిర్మించి యుద్ధరించగోరు నెడల మన బాలబాలికల విద్య తక్లీతోనే ప్రారంభము కావలెను. తరువాత తక్లీ పూర్వము భారతీయదినచర్యయం దెట్టి స్థానము వహించెడిదో బోధింతును. పిమ్మట వారికి కొంత చరిత్రను బోధించి యీపరిశ్రమ ఎట్లు అణగద్రొక్కబడినదో నేర్పుదును. మొగలు పరిపాలననుండియు చరిత్ర ప్రారంభించి తూర్పుఇండియా కంపెనీ ప్రవేశము, వారు సాగించిన దోపిడివ్యాపారము, అంతరువులుగా వారెటులదాడి సాగించి యణచి యణచి తుద కెట్లు మన ప్రధానపరిశ్రమగొంతు నులిమిపూడ్చి పెట్టినదియు దెలుపుదును. పిమ్మట తక్లీనిర్మాణమునుగూర్చి ముచ్చటింతును. బహుశః ప్రారంభమున నిది యొక వెదురుముక్కకు అడుగున రేగడిమట్టిముద్ద లేక తడిచేసిన పిండిముద్ద ఎండబెట్టి నడుమ నంటించి చేసియుందురు. ఇట్టి తక్లీలు నేటికిని బీహారు బెంగాలు ప్రాంతములలో నక్కడక్కడ వాడుకలో నున్నవి తరువాత క్రమముగా సీమట్టిబిళ్లకు బదులు చిల్లపెంకు బిళ్ల వాడబడుచుండెను. మన కాలమున నీ పెంకు బిళ్లకు మారు ఇనుప లేక యిత్తడి బిళ్లను వెదురు ఊచకు బదులు ఉక్కుఊచను వాడుచున్నాము. బిళ్ళయొక్కయు ఊచయొక్కయు పరిమాణము, దాని హెచ్చుతగ్గు లెట్లుండరాదదియు కూడ వారికి బోధించవలెను. పిమ్మట ప్రత్తి, అందలి రకములు, వాని కనుకూలమగు నేలలు, ఏదేశములలో పండునది, మనదేశమున నేరాష్ట్రములలో పైరగుచున్నది పత్తిరాలనుగూర్చి కొన్ని యుపన్యాసముల నీయవలసియుండును. ఈ వివరములను బోధించుటలో కొంత వ్యవసాయ జ్ఞానమును గూడ కలిగింతును.

ఈ విషయములన్నిటిని బోధించ గలుగుటకు ఉపాధ్యాయు డెంతయో జ్ఞానము సంపాదించవలసియుండును. మఱియు విద్యార్థులకు వడకిన గజములు లెక్కించుట, నూలు నెంబరు కట్టుట, చిలపలు తీయుట, ఒక్కొక్క పుంజమునకు పడుగులో నెన్ని పేకలో నెన్ని పోగు లుండునది గమనించుట ద్వారా ప్రాథమిక గణితమును నేర్పగలము. ప్రత్తి పండించుట దగ్గఱనుండి ఏరుట, పట్టుట, ఏకుట, వడుకుట, పడుగుచేయుట, నేయుట వగైరా బట్ట తయారగు వరకు గల పద్ధతులను బోధించుట లోనే ప్రతివిద్యార్థికిని మెకానిక్సు, చరిత్ర, గణితములను బోధించగలము.

శారీరిక, మానసికములకు ఆత్మకును వలయు విద్యనంతయు పరిశ్రమద్వారా బోధించుటయే నాప్రధానోద్దేశము. బాలుర యవగాహనమంతయు పరిశ్రమయొక్క వివిధరంగములను బోధించుటద్వారా నాకర్షించి తద్ద్వారానే భూగోళము, చరిత్ర వగైరా విషయములన్నిటిని నేర్పవలసియున్నది.

ఇట్టివిద్య నేర్పబడునెడల దాని ప్రత్యక్ష ఫలితముగా నది స్వయంపోషకము కా గలదు. స్వయంపోషకత్వమే యీ విధానవిజయమునకు తార్కాణము గాదు, పరిశ్ర మను శాస్త్రరీతిని బోధించుటద్వారా మానవుని వ్యక్తిత్వమంతయు వికసించి ప్రత్యక్ష మగుచున్నదా యనునదియే ప్రధానపరీక్ష. వాస్తవమునకు ఏదోవిధముగా స్కూలును స్వయంపోషకముగా నొనర్పగల నను ఉపాధ్యాయుని నేను తిరస్కరింతును, ప్రతి విద్యార్థియు తనలోని శక్తులన్నిటిని నుపయోగింప నేర్చినచో అనివార్యముగానే యీ విధానము స్వయంపోషకమగును. శారీరకముగా దినమునకు మూడుగంట లొక పరిశ్రమయందు పనిచేయు బాలకుడే స్వయంపోషకత్వ మలవరచుకొను చున్నచో మనస్సునకును ఆత్మకును ఆనంద మొనగూర్చు నవకాశములతో బని చేయునెడల నెంతవిజయ మగునో చెప్పవలెనా ?

## మహానాయకుల అభిప్రాయము

శ్రీ మహదేవాలాగా రిటు లనుచున్నారు :

"ఇప్పటి విద్యావిధానము క్రింద చదువు నేర్చు పిల్లవాండ్రు పట్టభద్రు లయిన పిమ్మటను సయితము తాము చదివిన చదువువలన ఏమి ప్రయోజనమును బడయ గలరో ఎఱుంగజాలకున్నారు. తరుణవయస్కులగు బాలురును బాలికలును కడు దరిద్రులయిననేతప్ప ప్రైమరీస్కూళ్లనుండి సెకండరీస్కూళ్లకును, సెకండరీస్కూళ్ళ నుండి కాలేజీలకును చదువులకై ఎగప్రాకుచున్నారు. అందుకు మితిమీరిన కర్చు,

ఈ స్కూళ్ళలోను కాలేజీలలోను తాము నేర్చుచున్నా మని నటించు సభ్యతను గురించి గాని, విద్యను గురించిగాని వారికి అభిమానమా శూన్యము. ఇక వారీ చదువుల నేర్చుట యెందుల కందురా ? తాము చేయగల పనిగాని, చేయవలసిన పనిగాని వారికి తెలియకుండుటే కారణము. తమకు వలయు జీవనవృత్తిని నిర్ధారణ చేసికొనుట యనెడు అతి క్లిష్టసమస్యను తేల్చుటలో కాలయాపనము చేయుటకు తగిన మిషగా మాత్రమే వారీచదువుల నవలంబించుచున్నారు. ఇటుల గమ్య మనునది లేక తమ జీవితములో ఇరువదేండ్ల ప్రాయమును, ఇంకను నెక్కుడు కాలమును గడపిన విద్యార్థులు ఆలస్యము, సందేహము, కర్తవ్యమూఢత్వము, అసమర్థత మొదలగు అవలక్షణములకు దాసులై తమబ్రతుకుతెరువును తెలిసికొనజాలక యుందురుండి రనుట సర్వవిదితమే.

ఒరిస్సారాష్ట్రవిద్యాశాఖామంత్రి మాన్యశ్రీ విశ్వనాథదాసుగారిటుల పలికిరి:

జాతీయమును ప్రయోజనకరమును కాని విద్య యేదియు విద్య యనిపించుకొనదు. ఈనాడు మన పాఠశాలలందు కఱపఁబడు విద్య జాతీయమూ కాదు. ప్రయోజనకారియూ కాదు. అది స్కూలునందును కాలేజీయందును ప్రవేశించు బాలకుని యొక్కయు, యువకుని యొక్కయు కల్పనా చాతుర్యమును హతము చేయునట్టి ఒకానొక విషబోధనాపద్ధతిగా నున్నది. నరునందలి శ్రేష్ఠతరాంశను వెలికి దీసి వానిలో నరునియెడను నారాయణుని యెడను అనురాగమును నెలకొలుపుటయే విద్యాశిక్షణముయొక్క పరమ లక్ష్యము. ఈ ప్రమాణముల ననుసరించి పరీక్షించుచో ఈదేశమున గఱపఁబడు విద్యకును ఆదర్శమునకును పొత్తు కుదురుటలేదు.

నలుబది యేండ్లనాడే శ్రీ వివేకానంద స్వాములవారును మన విద్యాపద్ధతిని గురించి పరితాపము వెలువరించియున్నారు. శ్రీ వారొకప్పుడు చెన్నపురి విద్యార్థుల గూర్చి యిట్లనిరి :

"కటా ! ఇప్పుడు మీరెటు లున్నారు ? ఏమి చేయుచున్నారు ? .... ....

పొత్తాలను సొగసుగ చేతబూని సముద్రతీరాన తిరుగులాడుట ; యూరపియనుల మెదడునుండి రాలిన ముక్కలేవో నాలుగు జీర్ణము చేసికొనకయే వల్లె వేయుట, ముప్పది రూపాయిల గుమాస్తాగిరి సంపాదించుట యెట్లా యని పంచ ప్రాణాలను ఆ మహోద్యమమునకై అర్పణము చేయుట, లేదా లాయరే ఐపోవుట:- అంతటితో భారతయువకులు ఆశాపర్వత మహోన్నతాగ్రమును అందికొన్నట్లే !

ప్రతివిద్యార్థియొక్క కాళ్లను చుట్టవేసికొని "బువ్వెట్టు బాబయ్యా" అంచు వాపోవు పనికూనల గుంపొకటి ! ఇసీ! మీపొత్తములను, మీగౌనులను, మీ విశ్వవిద్యాలయ యోగ్యతాపత్రములను ఒక్కుమ్మడి మిమ్ముల సయితము ముంచివేయజాలు వీరైన ఈ సముద్రాన లేదా !"

ఇంకొక సందర్భమున శ్రీ వా రిట్లు వ్రాసియున్నారు :

" మనవిద్యల నన్నిటిని విదేశీయుల నిగ్రహానుగ్రహాధికారములు లేకుండ మనము నేర్చుకొనుట అవసరము. దానితోపాటు ఆంగ్లభాషను, భౌతికశాస్త్రము లను నేర్వవలయును. ఉద్యోగాలకై దేవులాడక ప్రజలు తమ జీవనోపాధిని గణించుకొనుచు ముసలితనాన ఉపకరించు నిమిత్తము కొంత నిలువ చేసికోగల్గు పాటి సంపాదనను చేసికొనగలుగునటుల వారికి సాంకేతిక విద్యలను నేర్పుటయు పరిశ్రమలను అభివృద్ధి పఱచుటయు అవసరము.

" మనజాతి పూరికొంపలలో వసించు జాతి యని జ్ఞప్తి నుంచుకొనుము. కట కటా ! వీరికొఱకు ఎవరును ఏమియు చేయుట లేదే.

"వీరి కష్టార్జితముతో విద్య నేర్చుకొని, వీరినిగూర్చి ఇసుమంతయు శ్రద్ధ తీసి కొనని ప్రతివాడును ఈ కోట్లకొలది జనము విద్యల నెఱుంగక కూటికి పేదలై యుండునంతకాలమును మహాద్రోహి యగుచున్నాడనియే నేను వక్కాణింతును."

ఈ తీరుగా జాతీయావసరముల గుర్తించిన మహామహు లెల్లరును ప్రస్తుత విద్యాపద్ధతులవలని అనర్థములను, జాతీయ విద్యాపద్ధతియొక్క ఆవశ్యకతను చాటి యున్నారు. దేశదారిద్ర్యమును, నిరుద్యోగ సమస్యను రూపుమాపునట్టియు మిక్కిలి ధనవ్యయముతో అవసరములేనట్టియు విద్యావిధానమునకై అన్వేషణలను సాగించియున్నారు. తత్ఫలితార్థముగా వార్ధావిధానము వెలువడినది. దీనిని సాదర మతితో పరిశీలించుటయు, లోపము లున్న సవరించి యాచరణలో బెట్టు సదుపాయ ముల గూర్చుటయు ప్రతిభారతీయునకును విధాయక ధర్మము.

వార్ధావిధానమున కొన్ని ప్రధానాంశములును, మఱికొన్ని సామాన్యాంశములును కలవు. వీనిని విమర్శన దృష్టితో గమనింపవలయును. ఈ ప్రధానాంశములను ముందు విచారింతము.

## ప్రతిఫలము నొసగు చేతిపనిద్వారా విద్య గఱపుట

దీని అర్థము స్పష్టపడుటకై శ్రీ గాంధీమహాత్ముడు హరిజన పత్రికలో వ్రాయుచు వచ్చిన అంశముల గమనింతము గాక.

ప్రతి చేతిపనియు ఈనాడు యాంత్రికపద్ధతిని అనగా బుద్ధివికాసములో పని లేని అనుకరణ పద్ధతిని నేర్పబడుచున్నది. అటుల గాక శాస్త్రీయముగా నేర్పవలయును, అనగా బాలుడు చేయు ప్రతికర్మాంగమును గురించియు, అదేందులకు అవసరమో, దానివలని ప్రయోజన మేమో వానికి తెలుపవలయును.

ఏవియో కొన్ని సరకులను తయారుచేయుటకొఱకు మాత్రమే చేతిపనులను నేర్పుట కాక అవి విద్యార్థుల బుద్ధికుశలతను వృద్ధిపఱచు కొఱకుగా నేర్పుట అవసరము.

ఏదో ఒక వృత్తిగాని కొన్నివృత్తులుగాని బాలబాలికలకు పూర్ణవికాసమును బడయుటకు సాధనములుగా నుపకరించవలయును. కాబట్టి పాఠ్యాంశములు వృత్తి విద్యకు సంబంధపఱచి నిర్ణయించ వలయును.

వృత్తితో సంబంధపడిన అభ్యాసములు విద్యార్థియొక్క బుద్ధిని చురుకుగాను ఉల్లాసవంతముగాను నుంచును. మఱియు బుద్ధికి వ్యవసాయమునుగూర్చి పరిణతికి దెచ్చును.

ఉపక్రమణమునుమాత్రము వృత్తితో మొదలుపెట్టి తక్కినదాని నంతను అనుషంగికముగ దీసికొనివచ్చుట సామంజసము కాదు. విద్యా శిక్షణము యావత్తును వృత్తుల ద్వారముననె, వానిని నేర్చుకొలదిని వానితోపాటు సాగిరావలయును.

ఉదారవిద్య యని పేరొందిన నేటిచదువుతోపాటుగా ఏదేని వృత్తిని కూడ నేర్పు ప్రణాళికను నేను ప్రతిపాదించుచున్నది. ఏదేని వృత్తినో, పరిశ్రమనో ఆధారముగ దీసికొని దాని ద్వారమున విద్యాశిక్షణము నంతను నొసగు ననుటే నా అభిమతము.

ఆచరణరూప శిక్షణముద్వారా వృత్తిని గుఱించిన శాస్త్రజ్ఞానమును కళాభిరుచి, కల్పించుచు దానిద్వారానే విద్యనంతను నేర్పుటవలన నేటిఅనర్థములు తొలగగలవు.

ఈ భావముల నన్నిటిని సంగ్రహముగా శ్రీ గాంధీమహాత్ముడు హరిజనపత్రికలో నిట్లు వివరించిరి :

విద్యార్థులకు ఏదేని వృత్తి విద్యాశిక్షణమును గఱపవలయును, ఆ ప్రత్యేక వృత్తికి సంబంధపఱచి వాని బుద్ధి, వాని శరీరము, వాని చేతివ్రాలు, వాని కళాభిజ్ఞత మొదలగువాని నన్నిటిని వృద్ధికి తేవలయును.

పిల్లలకు చేతిపనులు మాత్రమే నేర్పుడని నేను కోరుట లేదు. ఆ చేతిపనుల నాధారము చేసికొని చరిత్ర, భూగోళశాస్త్రము, గణితము, భౌతికశాస్త్రము, భాష, చిత్ర రచన, సంగీతము అన్నియు నేర్పుడనియే నేను కోరుచున్నాను.

ఆధారవృత్త్యనువర్తనపద్ధతి అని ఈపద్ధతిని పేర్కొనుచున్నారు. ఈవార్ధావిధానము ప్రస్తుతపు విద్యావిధానమునకు పూర్తిగ భిన్నమై ఆకారణముచేత అపూర్వ పద్ధతిగ కాన్పించుచున్నది.

## ఒక పొరపాటు

చెన్నరాష్ట్రములో కొన్ని పాఠశాలలందు వడుకుట, నేయుట, నవారునేత, గుండీలు చేయుట మొదలగు విషయములను నేర్పుచున్నారు. ఈ హేతువుచేత "వార్ధా పాఠశాలలు" ప్రారంభమయ్యే యున్నవని కొందఱు ప్రవచించుచున్నారు. మధ్యరాష్ట్రి విద్యామాత్యుడును, విద్యాశాఖాధికారియు తనను చూడ వచ్చినప్పుడు ఈ పొరబాటును గుఱించి మహాత్ముడు ఈ క్రిందిరీతిని వివరించియున్నాడు :

"సర్వమునకును చేతిపని మూలాధారముగ నుండవలయును, కాబట్టివృద్ధిసంఘము వారు పల్లెటూళ్ల విద్యాప్రచారమున చేతిపనియొక్క ప్రయోజనమును ప్రధానాంశముగ గుర్తించి రని విన్నాను. విఖ్యాత విద్యానిపుణులు నాపద్ధతిని ఆమోదించుచున్నారనిన నాకు సంతోషమే. అయినను చేతిపనికి నే నెంతటి ప్రాధాన్యత నిచ్చు చున్నానో అంతటి ప్రాధాన్యత వా రిచ్చుచున్నా రని తోచదు. ఏమన బుద్ధి వికాసము హస్త శిక్షణము ద్వారమున రావలయునని నావాదన. 'హస్తశిక్షణము' అనగా పాఠశాలలో ప్రదర్శనార్థము పెట్టుకొను విలువలేని వస్తువులనో బొమ్మలనో తయారుచేయించుట కాదు. అమ్మకము కో దగిన వస్తువులను నిర్మాణము చేయవలయును."

ఈ తీరున పొరబడిన మఱొకరికి శ్రీ గాంధీమహాత్మ డిటుల వ్రాసియున్నారు.

" వడుకుట, ఏకులు చేయుట మున్నగు పనులు బుద్ధిశిక్షణకు సాధనముగా నుండవలయు"నను సూత్రమును మీరు బాగుగ గ్రహించి యుండలేదేమో యని అనుకొనుచున్నాను. అక్కడ జరుగుచున్నపని యిది: బుద్ధి శిక్షణ ప్రణాళికకు అనుబంధముగా ఈ ప్రణాళికను చేర్చి యున్నారు. ఈ రెంటికిని గల బేధమును మీరు గమనించవలయు నని కోరుచున్నాను వడ్రంగి యొకడు నాకు వడ్రంగమును నేర్పు నను కొనుడు. నేను ఊరక అతడు చూపినట్లెల్ల పనినేర్చుకొనుచుందును. తత్ఫలముగా నా యా పనిముట్లతో పనులు చేయుటకు నేను సమర్థుడ నగుదును. అయినను దాని

వలన నాకు బుద్ధివికాసము ఇసుమంతయు లభింపకపోవచ్చును. అటుల గాక అందు కర్మశాస్త్రప్రవీణుని వలన నేను వడ్రంగమున శిక్షణ పొందునెడల నా బుద్ధికిగూడ వికాసము లభించియుండును. అప్పుడు నేను వడ్రంగపుపనిలో నేర్పరినగుటే గాక శిల్పిని (ఇంజనీయరు) గూడ నగుటకు వీలగును. ఎట్లన, ఆ శాస్త్ర ప్రవీణుడు నాకు గణిత సిద్ధాంతములను నేర్పును. కలపలోని నేర్వేఱు రకములను గుఱించి తెలుపును. వాని విశేషప్రయోజనముల బోధించును. అవెందెందు దొరకునో ఎఱుక పఱచును, తన్మూలమున నాకు భూగోళముయొక్కయు వ్యవసాయముయొక్కయు విజ్ఞానము లభించును. మఱియు నా యా ఉపకరణముల ఆకృతులను చిత్రించుటను అతడు నాకు నేర్పగలడు. అంకగణితము, క్షేత్రగణితము మొదలగు విజ్ఞానాంశములు బోధించగలడు. కేవలము చదువుటమూలమునను వ్రాయుటమూలమునను నేర్పబడు మానసికశిక్షణముతో మీరు బహుశా హస్తకర్మకు అనుబంధము కూర్చి చూచియుండరు"

కాబట్టి ఇప్పటి పాఠశాల యొకటి 'వార్ధావిద్యాలయము' గా మారవలయు ననిన పూర్తిగ పరివర్తనము చెందవలసియుండును. జాకీరు హుస్సేనుగారి ప్రణాళికలో తెలుపబడినటుల ప్రతిఫలదాయకమగు చేతిపనిని ప్రవేశపెట్టవలసి యుండును.

వృత్తిద్వారమున బుద్ధికి ప్రబోధము కల్పించవలసి యుండును.

మూలాధారముగగొనిన వృత్తితో తక్కిన బోధ్యాంశములకు అనుబంధము కూర్పవలసియుండును.

## సాధ్యపడునా ?

జాకీరు హుస్సేనుగారు విద్యాసభలో నిటుల వాక్రుచ్చిరి :

విద్యాశాఖయందు పనిచేయుచున్న వారికి శ్రీ గాంధీజీపద్ధతి కేవలము క్రొత్తదిగ కాన్పించదు. యథార్థమగు విద్య కర్మ ద్వారమున మాత్రమే నేర్పవలసి యుండునని యెఱుంగుదురు. మఱియు చేతిపని ద్వారముననే ఆ యా బోధనాంశములన్నియు పిల్లలకు నేర్పవలసి యున్నదని యు వారికి తెలియును. పిల్లలకు పదునూఱేండ్లు వచ్చువఱకును ఏమేమో వస్తునిర్మాణము చేయుచు, మార్చుచు, పగులగొట్టివేయుచు, నవరణలు చేయుచు నుండుటనే వారు కోరుచుందురని మనతో ఉపాధ్యాయులుగ నున్న వారికి తెలిసినవిషయమే. ప్రకృతి వారికి విజ్ఞానము గఱపు మార్గమిదియే. పుస్తకాలు చేతబుచ్చుకొని ఒకమూలకూర్చుండు డనుట వారియొక్క దౌర్జన్యము చూపుటే

యగును. కావున చాలమంది ఉపాధ్యాయులు ఏదేని చేతిపనిని తమ బోధనకు ప్రధాన సాధనముగ చేసికొన ప్రయత్నించుచునే యుందురు. దీనినే అమెరికాలో "ప్రోజెక్టు" పద్ధతి యందురు; రష్యాలో "కాంప్లెక్సు పద్ధతి" అందురు ఈ పద్ధతుల కును వార్ధావిధానమునకు కొంత వ్యత్యాసము లేకపోలేదు. ఈరోపు నందలి లండను మిషనుత్రయినింగుపాఠశాలలో ప్రోజెక్టుపద్ధతిని అత్యుత్సాహముతో అవలం బించుచున్నారనియు, జయప్రదముగనుండ గాంచితి మనియు మనవిద్యామాత్యులు వార్కేగారు ధృవపఱచు చున్నారు.

## స్వయంపోషక విద్య

వృత్తి విద్యను నేర్పుటయు, తద్వారా బుద్ధివికాసము చేకూర్చుటయు నను అంశ మునకు తరువాత, విద్యను స్వయంపోషకముగ చేయుటెట్లనునది ముఖ్య సమస్యగ నేర్పడుచున్నది. వార్ధావిధానమునందలి ఈ యంశమును గుఱించి చాల అపోహలు కలవు. ఈ అంశమునెడ మిక్కిలి ప్రతికూలభావమును కలదు. కాబట్టి కొంచెము లోతునకు దిగి దీనిని పరిశీలింపదగును.

స్వయంపోషణ మనగా రెండర్థములు కలవు. బడివిడిచినతోడనే విద్యార్థి తన జీవనోపాధిని తాను గడించుకోగల సమర్థత నొసగు విద్య యనుట ఒక అర్థము.

విద్య గఱపుట కగు వ్యయము ఆ సాధనమువలననే సమకూడవలయు ననుట రెండవ అర్థము.

ఇప్పటివలెగాక విద్యార్థి బడివిడిచి పోగానే ఏదోవృత్తిని అవలంబింపగల్గి యుండ వలయు నను అంశమును విచారింతము. దీనివలన దేశమును పీడించుచున్ననిరుద్యోగ సమస్య పరిష్కారము కాగలదు. శ్రీ గాంధీమహాత్ముడు చెప్పున దేమో చూతము.

"ఇప్పుడు మనబాలుర బుద్ధిబలము వ్యర్థము చేయబడుచున్నది. బడివీడిన పిమ్మట ఏమి చేయవలయునో తోచక మన యువకులు వెంవెల బోవుచున్నారు. బిడ్డల యొక్క ఆత్మప్రభావము. బుద్ధి వైశద్యమును, శరీరబలమును ప్రకాశమునకు దెచ్చి ప్రోత్సాహము నీయగలదే యథార్థమగు విద్య యనిపించుకొనును. వార్ధాపాఠశాల బాలురను నిరుద్యోగ బాధనుండి రక్షింప గల హామీ నిచ్చునదిగా నుండవలయును.

ఏడేండ్లు శిక్షణ గడచినపిమ్మట పదునాలుగేండ్ల వయస్సుగల బాలుడు సంపాదన పరుడుగా బడినుండి వెలువడవలయును. ఈ నాడును పేదవారి బిడ్డలు సహజముగనే తమ తల్లి దండ్రులచేతి కక్కఱకు వచ్చుచున్నారు. 'నేను నాతల్లిదండ్రులతోపాటు

పనిచేయనియెడల వారేమి తిందురు? నా కేమి పెట్టగలరు?' అనెడు భావము వారి మనస్సులో గలదు. అదియు ఒకవిధమగు విద్యయే. అదే తీరున ఏడేండ్ల ప్రాయమున బాలుని దొరతనమువారు చేకొని సంపాదనపరునిగా నొనర్చి వానినికుటుంబమునకు త్రిప్పి పంపుదురు. ఇట్లు మీరు విద్య నేర్పుచున్నారు. మఱియు నిరుద్యోగ సమస్యను సయితము పరిష్కరించుచున్నారు."

ఇక రెండవ అర్థమే వార్ధా విధానము నందు ప్రధానము. పిల్లలు చేయు చేతిపని ద్వారమున పంతుళ్ల జీతములు భర్తీ కావలయును. శ్రీ గాంధీమహాత్ముడే ఈఅంశమును విపులముగ వివరించియున్నాడు.

"ఈ తీరున సమగ్రముగా భావనచేయబడిన ప్రాథమిక విద్యావిధానము మొదటి సంవత్సరమును, ఒకవేళ రెండవసంవత్సరమును స్వయంపోషకము కాలేక పోయినను మొత్తముమీద స్వయంపోషకమై తీరును.

చేతిపనులద్వారమున నేర్పబడువిద్య, నేను దానికి నిర్ణయించిన ఏడు సంవత్సరముల గడువులో మొత్తముమీద స్వయంపోషకము కాగలదని నాశపథము. మొదటి రెండు వత్సరములలోను కొంతనష్టము రావచ్చుననియు నేను ప్రత్యేకముగా చెప్పియే యున్నాను.

విద్యార్థి దినమునకు నాలుగు గంటల కాలము వృత్తి పని చేయు ననుకొనుడు. గంటకు అర్ధణా చొప్పున నెలకు ఇరువదియైదు దినములు పనిచేయు నని లెక్కవేయునెడల ఆ బాలుడు గాని బాలికగాని పాఠశాలకు రు 3-2-0 సంపాదించి పెట్టిన ట్లగును. ఇట్లనుటచేత మొట్టమొదటినుండియు గంటకు అర్ధణా చొప్పున ప్రతివిద్యార్థియు సంపాదించి పెట్టగల్గునని భావము కాదు. ఏడేండ్ల గడువుకాలము నంతను లెక్కవేసినయెడల గంటకు అర్ధణాసంపాదన తేలగలదని అర్థము.

ఏడు సంవత్సరములమీద లెక్కవేయునెడల ఈ విధానము స్వయంపోషకము కాగల దను దృఢవిశ్వాసము నాకు గలదు. మొదటి సంవత్సరములో ప్రతిపిల్లవాడును దినమునకు ఒక అర్ధణాయే సంపాదించినను రెండవ సంవత్సరము అతడు ఒక అణా సంపాదింపగల్గును. ఈ విధముగా వారి ఉత్పత్తిశక్తి వృద్ధి పొందుచుండును. కాన అనంతర జీవితమున వారు తమ జీవనోపాధిని గడించుకొనగలవా రగుదురు.

* * *

ఉపాధ్యాయుని జీతమును వాని విద్యార్థుల చేతిపరిశ్రమమూలమున సమకూర్పగల్గుటను గుఱించి నేను చాల పట్టుదలతో ఆలోచించుచున్నాను. * *

"నివేశన స్థలములు, భవనములు, పరికరములు మొదలగునవన్నియు పిల్లల పరిశ్రమ సంపాదనవలన సమకూడవలయు నని నా ఉద్దేశ్యము కాదు. ప్రతివిద్యార్థిని వాని పరిశ్రమ వలన వాని బోధ కగు వ్యయమును సంపాదించి యీగల సమర్థుని చేయవలసి యున్నది."

శ్రీ మష్రువాలా గారు ఈ విషయమును ఇంకను సుస్పష్టము చేయుచున్నారు :

సగటున దినమునకు మూడుగంటల చొప్పుననే సంవత్సరములో తొమ్మిది మాసములకు లెక్కవేసి చూడగా, వార్ధా (లేక శేగామ) పాఠశాలయొక్క ప్రయోజకత్వము నిరూపణ కావలయును. పూర్తి పాఠశాలలో ఏడు తరగతులకు తక్కువ యుండవు. ప్రతి తరగతిలోను సగటున ఇరువదియైదుమంది విద్యార్థు లుండగలరు. ఎనిమిదిమంది లేక తొమ్మిదిమంది ఉపాధ్యాయు లుందురు. ఉపాధ్యాయుని జీతము ఇరువదియైదు రూపాయి లుండవచ్చును. (కనీసము ఇరువదిరూపాయిలకు తగ్గరాదు) అప్పుడు పాఠశాలలో ఉత్పత్తి చేయబడు వస్తువులమీద ఉపాధ్యాయ వర్గముయొక్క జీతముల మొత్తము సంపాదింప దగి యుండవలయును."

స్వయం పోషకత్వమును గుఱించిన పూర్తి వివరములు తెలిపోయినవి.

## స్వయంపోషకత్వమునకు అవసర మేమి ?

భారతదేశముయొక్క దరిద్రదశయే విద్యాసమస్య కిట్టి పరిష్కారమును కూర్చుటకు మహాత్ముని ప్రేరేపించినది. కోట్లాదిగా నున్న మన బిడ్డలకు విద్య నొసగుటకు గత్యంతరము లేదని నానిశ్చయము అనుచున్నాడు. వైస్రాయిగారు సైనిక వ్యయము తగ్గించువరకును మనకు చాలినంత రెవిన్యూ లభించు వఱకును మనము ఆగియుండ జాలము. సారాయము మీద వచ్చు రెవిన్యూ లేనిది విద్యాప్రచారవ్యాప్తి సాధ్యము గాదని ప్రజలలో అపోహ వ్యాపించి యున్నది. దీనింగూర్చి మహాత్ము డిటుల వ్రాయుచున్నాడు :

" నూతన సంస్కరణముల ఘోరతరాన్యాయము మన బిడ్డలకు చదువులు చెప్పించుకొనవలయు ననిన కల్లు సారాయి దుకాణముల వలన వచ్చు రెవిన్యూ తప్ప గత్యంతరము లేకుండ చేయుటలో గలదు. అది మన విద్యాసంబంధమగు చిక్కు. అయినను అది మనలను భగ్నమనోరథుల చేయగలదు. మనము దానివి పరి

ష్కారము చేసియే తీఱవలయును. ఆ పరిష్కారము ఎట్టిదైనను కూడ మద్యపాన నిషేధమును గుఱించిన మన ఆదర్శమునకు భంగము రాదగదు. త్రాగుడు వలన రివెన్యూ లేని పక్షమున మన బిడ్డలు విద్యాహీనులై పోవలసినదే యను తలంపే లజ్జాకరమును అవమానకరమును నైనది. * * *

నేని కదిగా ఆ రెంటిను అవసరములే. రెవిన్యూ ఉండనీ రెవిన్యూ లేకపోనీ, చదువులు లభింపనీ లభించకపోనీ సంపూర్ణ మద్యపాన నిషేధమును సాధించియే తీఱవలయు ననెడి దీక్షతో నిలువబడ వలసినదే, అదేతీరున భారతదేశపు గ్రామముల అవసరములను గమనించి మన గ్రామవిద్యాప్రచారమును నిర్బంధము చేయుదుమేని, స్వయం పోషకముగను చేసియే తీరవలయు ననెదు శపథముతో ప్రారంభింపవలసి యున్నది. * * *

విద్యా సమస్యను ఎటుల పరిష్కారము చేయుటయా యను సమస్య త్రాగుడు వలన వచ్చు రెవిన్యూను పోనాడుకొనుటతో మహాదురన్యాయముగా ముడిపెట్ట బడినది. క్రొత్తపన్నును వేయు మార్గములును సాధనములును కలవనుట నిస్సందేహము. * * *

విద్యావిషయములో జాతీత్వేనా మనము చాల వెనుకబడియున్నాము. కావున మన కార్యక్రమము డబ్బుమీద ఆధారపడునెడల ఆ యంశమును మన మీ తరములో ఒక నియమితకాలములో మన జాతియెడల మనము నిర్వహింప వలసిన ధర్మమును నిర్వహింపజాలు ఆశయు లేదు. కాబట్టియే నిర్మాణ కౌశలమును గూర్చి ప్రఖ్యాతి నంతను బలిపెట్ట వలసి వచ్చిననుకూడ విద్య స్వయంపోషకము కావలెనను ప్రతిపాదనము చేయ సాహసించి యున్నాడను. * *

ఏడు సంవత్సరములు పదునాల్గు సంవత్సరముల మధ్య యీడు బిడ్డల కేము చౌరతనమువారు పూనుకొని ఉత్పత్తి ప్రదమగు పరిశ్రమ ద్వారమున వా శరీరములకును మనస్సులకును శిక్షణ గఱపుపట్ల పల్లికు పాఠశాలలు స్వయపోషకములు కానిచో అవి బూటకములనియు, ఉపాధ్యాయులు వెఱ్ఱగులనియు చెప్పవలసినదే."

శ్రీ గాంధీమహాత్మ ఈ వాక్యములందు తనదృఢతర విశ్వాసమును ప్రకటించి యున్నాడు. పాఠశాలలను స్వయంపోషకముగ నొనర్చుటలో వారి కేలాటి సందేహమును లేదు.

## ఆచరణయోగ్యమేనా ?

శ్రీ గాంధీమహాత్ము డింతగా నొక్కి చెప్పుచున్నను ప్రజలలో ఈ విధానము ఆచరణయోగ్యమగు నను నమ్మకము పూర్తిగా కలుగుటలేదు. ప్రాచీన కాలమున మనదేశమునం దెల్లెడల నిట్టి విద్యాసంస్థలే యుండియున్నను చాలశతాబ్దముల నుండి మన మా విధానానికి దూరులమై పోయినకారణమున, ఇదంతయు విప్లవపంథగా కాన్పించుచున్నది. ఆకసమున మేడలు కట్టబోవుటవలె తోచుచున్నది. పోనిండు, ప్రయోగమూలమున పరీక్షించుద మన్నను అట్టి ధైర్యము కొఱవడియున్నది. మిషనరీలు కొందఱు ఈవిధానమునుంబోలు పద్ధతిని కొన్నిపాఠశాలలను నడుపుచున్నారు. శ్రీ డాక్టరు ఆచంటి లక్ష్మీపతిగారు వానిని దర్శించి తమ హర్షమును నిటుల దెల్పుచున్నారు.

"ఆపాఠశాలలు ఉదయమున మాత్రమే పనిచేయును, సాయంసమయమున వ్యవసాయపుపనులుగాని, లేక ఏవేని చేతిపనులు గాని చేయుచుందురు. విద్యార్థులు చేయుపనుల రకమును బట్టియు, పరిమాణమును బట్టియు వారికి కొంత కూలి యివ్వబడుచున్నది. ఈ విధముగా వారిసంస్థ దాదాపు స్వయంపోషకముగచేయబడుచున్నది. ఆ విద్యార్థులు బడి విడిచిపోయినపిమ్మట తమ జీవనోపాధిని గడించుకోజాలుదురు. ఇతరపాఠశాలల విద్యార్థులవలె వీరు బడివిడిచినప్పుడు చెఱువు నుండి యొడ్డున వేయబడిన చేపలవలె ఇడుమల బడరు. ఈ పాఠశాలల వాతావరణమును విద్యాశాఖాధికారులు నడుపు పాఠశాలల వాతావరణము వలె ఉల్లాసరహితమును నిర్జీవమును నైయుండక, భిన్నముగనుంట కనిపెట్టితిని. ఈ బిడ్డలు తాము కొంత ప్రయోజనకర మగు పనిని నిర్వహించితి మనెడు భావముతో ఉత్సాహులుగను ఆరోగ్యవంతులుగను నుండిరి. వీరి శరీరములు పుష్టిగ నుండును."

మధురజిల్లాలోని పసుమలై ట్రైనింగు అండ్ హైస్కూలును, డోర్నకల్లు నందలి హైయ్యరు ఎలిమెంటరీ స్కూలును దర్శించిన మదరాసు విద్యాశాఖామాత్యులును వానిం గూర్చి ఇట్టి సాక్ష్యమునే యొసగుచున్నారు. తెలివితేటలతో నిర్వహించు నెడల మన ప్రాథమిక విద్యాలయములను స్వయంపోషకములుగ నొనర్చుటలో సందేహము లుండజాలవు.

## ఏడేండ్ల గడువు

చెప్పుకోదగినంత ఉత్సాహముతో నడువకున్నను ఉచిత నిర్బంధవిద్య ఇప్పుడును కలదు గదా యని కొందఱు పలుకుచున్నారు. వార్ధావిధానమువలన కలుగబోవు మార్పేమో విచారింతము.

1. ఇప్పటి నిర్బంధ ఉచిత ప్రారంభవిద్య అయిదేండ్లు అయిదు తరగతులలో నేర్పబడుచుండ వార్ధాపాఠశాలలలో నీ విద్య ఏడేండ్లు ఏడుతరగతులలో నేర్పబడును.

2. ఇప్పటి బడిపిల్లల వయస్సు 5 మొదలు 10 సంవత్సరములు. వార్ధా విద్యార్థుల వయస్సు 7 మొదలు 14 సంవత్సరములుగ నుండును.

3. ఇప్పటి నిర్బంధోచితవిద్య బిడ్డల శిక్షణమున ప్రారంభదశగా నుండెను. వార్ధావిధానమున అది రెండవ దశాంతరముగ నుండును. ప్రథమదశాంతరము 3వ యేటు మొదలు 6వ యేడు వఱకు ఇంటికడనే గడచును. దీనిం గూర్చిన వివరములు ఈ గ్రంథమున వేఱొకతావున గాననగును.

4. ఇప్పటి బడులలో ఉచితముగను నిర్బంధముగను అయిదు సంవత్సరముల పాటు ఎలిమెంటరీవిద్యమాత్రమే నేర్పుదురు, వార్ధావిద్యాలయములలో ఏడు సంవత్సరములలో ఎలిమెంటరీ విద్యతోపాటు సెకండరీ విద్యను కూడ నేర్పుదురు.

5. ఇప్పటి ఉచితవిద్యకు అర్థము, బిడ్డల చదువులకై తలిదండ్రులు జీతమిచ్చుకోనక్కరలేదని మాత్రమే. వార్ధావిధానమునందలి ఉచితవిద్యకును తలిదండ్రులు జీతా లీయ నక్కరలేదు. అంతవఱకే అది ఉచితమన దగినను విద్యార్థులు బడులలో చేయు పనులవలన ఉపాధ్యాయుల జీతములు రాబట్టబడుటచేత నది కేవలము ఉచితము కాదు. మఱియు భవనములు, స్థలములు, పరికరములు మొదలగువాని కొఱకై ఇప్పటివలెనే తలిదండ్రులు దొరతనమువారి ద్వారమున పన్నుల రూపమున ధనము నిచ్చుకొనుచునే యుందురు.

ఈ తీరుగా ఇప్పటి ఉచిత నిర్బంధ ప్రారంభవిద్యకును వార్ధావిధాన నిర్బంధ ప్రారంభవిద్యకును స్వభావమునందును పరమావధి యందును ప్రణాళికయందును గూడ చాలభేదములు గలవు. ఈ భేదముల ననుసరించి కొన్ని శంకలు బయలు దేరుచున్నవి. అందు ప్రధానమగునవి (1) ఏడేండ్లపాటు మాత్రము విద్యగఱపుట చేత వార్ధావిధానము విద్యార్థులను పూర్తిగ కృతకృత్యులను చేయగలదా?

2. విద్యార్థుల వయస్సును నేడు పదునాలుగు సంవత్సరముల మధ్యగా నిర్ణయించుటకు ఉద్దేశ్య మేమి?

3. ఇప్పటికే పేద లగు తలిదండ్రులకు తమ బిడ్డలను అయిదేండ్లపాటు బడికి బంపుట కష్టముగా నుండగా ఆగడువును ఏడేండ్లవఱకు పెంచుట న్యాయమగునా?

ఈ సందేహముల దీర్ప ప్రయత్నింతుముగాక: జాకీరుకమిటీవారిటుల దెలిపిరి:

"విద్యాసభవారు నిర్బంధవిద్య ఏడు సంవత్సరములలో ఏడు తరగతులందు నేర్పవలసినదిగ నిర్ణయించియున్నారు. బడిలో ప్రవేశించు బాలికకుగాని బాలునకుగాని ఏడేండ్లవయ స్సుండవలయును. వారు పదునాలుగేండ్ల ప్రాయములోపల బడివీడరాదు. అయినను తలిదండ్రులు కోరునెడల బాలికలుమాత్రము పండ్రెండేండ్లవయస్సు పిమ్మట బడి విడువ వచ్చును."

ఈ ఏడేండ్ల శిక్షణము కమిటీవారు విధించినను మహాత్ముడు అంతటితో పూర్ణతృప్తిని బడయలేదు 'ఏడేండ్లుమాత్రమే యని నా విధానము నిర్ణయించియుండలేదు. నేను ఆశించు బుద్ధివికాసము లభించుటకు ఇంకను హెచ్చుకాలమే పట్టవచ్చును. ఈ శిక్షణగడువును పొడిగించుటవలన దేశమునకు నష్టమేమాత్రమును రాదు.' అని శ్రీ గాంధీగా రొకప్పుడు వ్రాసియున్నారు. కమిటీవారి రెండవరిపోర్టులో వారును విద్యార్థులకు సరియైన నైతిక, సాంఘిక ధర్మములను లౌకిక వ్యవహారవిజ్ఞానమును అలవడు కొఱకు వారిని పదునారేండ్లు వచ్చువఱకును విద్యాలయములం దుంచి శిక్షణ గఱపుట తమకు సమ్మతమే యనిరి. కాని ఏడు పదునాలుగేండ్లమధ్య ప్రాయమున బిడ్డలు విధిగా శిక్షణమును బడయవలయు ననుచున్నారు. ఏడేండ్ల వయసులోపల బిడ్డలకు పౌర సాంఘిక విధులను గురించి బోధనలుచేయుట సుసాధ్యము కాదు. పదునాలుగేండ్లు వయ స్సున్నగావి అట్టి విధుల నాచరణలోబెట్టు బాధ్యతను వారిపైని విధించుటకు గాని ఏదేని వృత్తి వలన స్వతంత్రజీవనోపాధి గడించుకోగలరని ఆశించుటకు గాని కమిటీవారు సమ్మతి తెలుపలేదు.

ప్రస్తుతము తలిదండ్రులు తమ బిడ్డలను అయిదేండ్ల వఱకైనను తమ ఆర్థిక పరిస్థితులను బట్టి బడులలో నుంచుటకు సమ్మతించుట లేదు. అయినను దేశక్షేమమును విచారించి దొరతనమువారు ఏడేండ్లో తొమ్మిదేండ్లో నిర్బంధ విద్యను విధింపవచ్చునని కొందరభిప్రాయ పడుచున్నారు. వాఙ్మయపరిచయమును, వృత్తికౌశలమును చక్కగా నమరు విద్యార్జనమును మనసున బెట్టుకొని వారటులనుట సమంజసమే. ఇంగ్లీషు తప్ప, తక్కిన విషయములలో మెట్రిక్యులేషను విజ్ఞానపరిమాణముగల విద్యను, దానితోపాటు ఒక వృత్తి విద్యను నేర్పుటకు ఏడేండ్లు. ఏడేండ్లు హెచ్చుగడు వన వీలులేదు. పాఠశాలలు స్వయంపోషకములే

విద్యార్థులు బడులలో గడించు ఆర్జనలో కొంతభాగము తలిదండ్రుల కిచ్చు వసతి గలుగునెడల ఏడేండ్లపరిమితిని హెచ్చించుటలో తలిదండ్రుల ఆక్షేపణ యుండ రాదని మ్మ్రుషువాలాగారు తమ అభిప్రాయమును తెలిపిరి. అయినను తలిదండ్రుల ఇప్పటి ఆర్థికస్థితిని గమనించి ఏడేండ్లపాటు నిర్బంధము చాలు నని కమిటీవారు నిర్ణ యించిరి.

## దేశ భాషలు

వార్ధావిధానములో నాలుగవ ప్రధానాంశము పాఠములు చెప్పుటలోను బోధ్యాంశ ముల జదువుటలోను మాతృభాష కెట్టి ప్రాముఖ్యత నొసగవలయు ననునది: ఏ విష యము బోధించినను అది బిడ్డల మాతృభాషలోనే బోధించవలెను. ఇప్పటివలె ఇంగ్లీషును ప్రథమభాషావిషయముగను, విద్యార్థిస్వభాషను రెండవ భాషావిషయ ముగను నుంచక, మాతృభాషను ప్రథమ భాషాంశముగను, బోధన కంతటికిని ఆధార ముగను కమిటీవారు నిర్ణయించియున్నారు. హిందీ (లేక హిందూస్థానీ) రెండవ భాషగా నిర్ణయింపబడినది. ఆ యా రాష్ట్రిదొరతనములవారు వసతుల ననుసరించి అవసరములను విచారించి ఇంగ్లీషును అనుబంధభాషగా నేర్పాటు చేయవచ్చును.

కమిటీవారి మొదటి రిపోర్టులో నున్నటుల విద్యాబోధ కంతటికిని మాతృభాష ముఖ్యాధారముగా నుండి తీఱవలయును. మాతృభాషలో తప్పులు లేకుండ వ్రాయు టను, చదువుటను, ధారాళముగ భావములను వ్యక్తముచేయుటను నేర్వనిది ఎవ రును ఊర్జితభావసంపదను గడింపజాలరు. బిడ్డలు పరంపరగా వచ్చు తమ జాతి వారి భావసంపదను అనుభూతులను ఆశయములను పరిగ్రహింపజాలరు. సరి యైన నైతికధార్మిక భావముల పూరింపుకు, సాంఘికవిద్య నేర్పుటకు మాతృభాష ఎనలేని సాధనముగ నుండును. మఱియు బిడ్డకు తనయొక్క రసజ్ఞతను, కళావి జ్ఞతను ప్రకటించుటకు సహజ ధోరణి లభించును. సక్రమ శిక్షణము గఱచిన యెడల వాఙ్మయపఠనము ఆనందానుభవమునకును సరసానుభూతికిని కల్పనా చాతు ర్యమునకును సాధనము కాగలదు. తదనుగుణమగు పాఠ్యక్రమమును కమిటీ సూచించియుండిరి.

## హిందూస్థానీ

రెండవ భాషగా హిందూస్థానీకి మాతృభాష ప్రక్కను గౌరవపదవి నొస నిర్బంధముగా నేర్పవలయునని కమిటీవారు నిర్ణయించినారు. ఈ జాతీయస్థా

శాలలలో చదువు విద్యార్థులందఱును మనజాతీయ సమష్టిభాషయొక్క పరిచయము కలిగియుండవలయు ననుటే ఇందుకు హేతువు. భారతదేశమున హిందువులు మహమ్మదీయులు నను రెండు సభ్యజాతులవారు అధికసంఖ్యాకులుగ నున్నారు. ఈ రెండు తెగలవారికిని మాన్యమును విశాలమును నగు వాఙ్మయము కలదు. ఇరు పురకును హిందూస్థానీ సమానభాషగా వ్యాప్తిగాంచునెడల ఈ ఇరుతెగలలోను గల నాయకశిఖామణులును, ప్రవక్తలును, భక్తులును, రచించినగ్రంథములలోని ఉత్తమ భావరాశిని ఒండొరులు పంచుకొనుటకు వసతి యేర్పడును. మఱియు వివిధరాష్ట్ర ప్రజలు ఈ సామాన్యభాష ద్వారమున సన్నిహితపరిచయమును గుదుర్చుకొని దేశోద్ధరణ కగు సమష్టికార్యములందు కలసిమెలసి పనిచేయగల్గుదురు. హిందూస్థానీనే హిందీగా వాడుకొను వాడుచున్నారు. ఈ భాషను హిందువుల యొక్కయు మసల్మానులయొక్కయు భాషలసమ్మేళనముగ నెంచదగును. దేశీయు లెల్లరును అన్యోన్యమైత్రిలో కూడి సంభాషించుకొనుటకును సభలలో ఉపన్యాసముల నిచ్చుకొనుటకును సమష్టిమహోద్యమములను నడపుటకును ఈ భాష సులువుగా నుపకరించును.

హిందూస్థానీభాషనే మాతృభాషగా గల రాష్ట్రములందు దానినే ముఖ్యభాషగా నెన్నుకొందురు, తదితరప్రాంతములందు దానిని రెండవభాషగా నియమించి సర్వసాధారణవ్యవహారమున కుపకరించునంతటి జ్ఞానమును మాత్రమే ఏడవ తరగతి విద్యార్థులు కలుగుటకు విద్యాప్రణాళికయందు వసతి నేర్పాటుచేసిరి. ఏడవతరగతిలో ఉత్తీర్ణు డగునప్పటికి విద్యార్థి హిందూస్థానీలో కొలదిపాటి ఉపన్యాసమునిచ్చుటకును, సంభాషణ జరుపుటకును సమర్థత కలిగియుండవలె ననిరి.

అతడు తేలికశైలిలో వ్యవహారసంబంధపు ఉత్తరముల వ్రాయగల్గి యుండవలయును. సులభశైలిలో నున్న గ్రంథములను, వార్తాపత్రికలను, వ్యాసములను చదివి అర్థము చేసికో దగియుండవలయును. ఇంకను వివరములకొఱకు విద్యాప్రణాళికలో చూడదగును. ఇంతమాత్రపు హిందూస్థానీభాషను ఏ మూడుసంవత్సరములలోనో నేర్చుట విద్యార్థులకు కష్ట మనియు, మాతృభాషలకు దీని పోటీవలన నష్టము వాటిల్లు ననియు వాదించుట విపరీతము. ఎంతెంత బాధయోపడి ప్రధానభాషగా నేర్వవలసిన ఆంగ్లభాషనుండి ముక్తులై, బోధ్యాంశముల నన్నిటిని మిక్కిలి దుర్గ్రాహ్యమగు ఆ పరభాషద్వారమున నేర్వవలసిన బాధ తొలగినవారై విద్యలనేర్చు వార్ధా విద్యాలయపు బాలబాలికలు అదృష్టవంతు లనుటలో సందియములేదు. అనేకకార

ణములచేత్త దురభిమానము వహించి ఆందోళనముల సాగించువారికి చెప్పవలసిన దేమి యుండగలదు? ఇంకొక విషయము. హిందూస్థానీభాష నేర్చుట చాల సులభముకూడను.

## అహింసాధర్మము

ఇంతవఱకు వార్ధావిధానమందలి నాలుగు ప్రధానవిషయములంగూర్చి వివరించి యుంటిమి. అహింసాధర్మమును గుఱించికూడ వానితోపాటుప్రధానముగ నెంచి విచారింపనగును. దీనిం గుఱించి విద్యాసభలో మహాత్ముని ఉపన్యాసము నిదివఱకే గమనించి యుంటిమి. సాధారణముగా అన్ని ప్రాంతములందును అన్ని వార్తాపత్రికలలోను ప్రత్యేకగ్రంథములలోనయితము మహాత్మునికిఅత్యంతప్రియమగు అహింసా తత్వమును గుఱించి విపులప్రచారము జరిగియే యున్నది. దేశమున నన్ని కక్షల వారును అంగీకరించినసామాన్యవిషయమే యిది. ఇందుగుఱించి కాకా కలేల్కారు సభలో తెలిపిన నాలుగుముక్కలు పాఠకులకు తెలిపి ఈ విషయమును ముగింతుముగాక :—"యాంత్రికయుగము వచ్చిపడుటతో మన మీనాడు కీలుబొమ్మలుగ చేయబడిన జాతిమై పోతిమి. ఏల యన మనము యంత్రములతో తయారైన వస్తువులు కొనుచుంటిమిగాన మనముగూడ యంత్రసిద్ధవస్తువుల నిర్మాణమును సాగించితిమా మనమును పరపీడాకరజాతియే యగుదుము. కాని దేశములోని సమస్త జనమును పెంపుడు పశువులును పనులలో వినియోగింపబడు వఱకును యంత్రసాహాయ్యమునకు పూని వాని నోటి కడ నన్నమును డీయుట మనకు ధర్మము కాదు. విద్యయు దౌర్జన్యమును పరస్పర విరుద్ధవిషయములని నా యభిప్రాయము. కాన, విద్యను అహింసా దృక్పథమునుండి చూడవలసి యుండును. మొదట మొదటగా నేను విప్లవప్రియుడనై యుంటిని. దౌర్జన్యమునందును శారీరక హింసయందును నాకు విశ్వాసముండెడిది. కాని యథార్థమగువిద్య అహింసా తత్వములో నేర్పవలసినదే యనియు శ్రీ గాంధీమహాత్ముని విద్యా విధానమున అహింసయే ప్రధానోద్దేశ్యమనియు నేను గ్రహించినాడను."

ఇంతవఱకు వార్ధావిధానమందలి ప్రధానాంశములగూర్చి చర్చించి యున్నాము. ఆయాయంశములగూర్చిన శ్రీ గాంధీమహాత్ముని అభిప్రాయములను అక్కడక్కడ మఱి ఇతరుల భావములను తెలుపుచు విషయమును చాల సుస్పష్టముగ ప్రకటించియుంటిమి. అయినను ఈ సందర్భమున నింక కొన్ని అంశములను గుఱించియు వ్రాయుట ఈ నూతన విధానమునకును ఇప్పటి విద్యాపద్ధతికిని గల

తారతమ్యమును అవగాహన చేసికొనుటలో తోడ్పడగలదను విశ్వాసముతో అట్ల చేయుచున్నాము.

## మెట్రిక్యులేషను ప్రమాణము

వార్ధావిధానము ప్రారంభవిద్యను గూర్చినదని చెప్పుకొనుచున్నను ఈ ప్రార విద్యలో ఇప్పుడు మెట్రిక్యులేషను చదువు విద్యార్థులు నేర్చు విషయములు ప్రమాణమునకు తగ్గకుండ ఇముడ్చబడియున్నవి. కాని ఇప్పటి హయ్యరుఎలి టరీస్కూళ్ళలోనే ఎనిమిది తరగతు లుండునే. వార్ధాపాఠశాలలో నుండేది పదిత తులు మాత్రమే గదా? ఇందు చదువు విద్యార్థులకు మెట్రిక్యులేషను ప్రమా విద్య రాగలదని మరియుట హాస్యాస్పద మని కొందరు హేళనచేయ బూన న్నారు. దీనిం గురించి శ్రీ గాంధీమహాత్ముడు తెలుపు సమాధానమును / నింతము.

"నేను ప్రాథమిక విద్యకు అత్యంత ప్రాధాన్యత నిచ్చుచున్నాను. నా అభిమ ప్రకారము ఈ ప్రాథమికవిద్య ఆంగ్లభాష కాక తక్కిన అంశములలో మెట్రిక షను ప్రమాణమునకు తగ్గదు.

ఏడేండ్లుగాని అంతకు మించిగాని గడువుతో ఆంగ్లభాషమినహా తక్కిన యములను మెట్రిక్యులేషనుప్రమాణమువఱకు బోధించు ప్రాథమికవిద్య ఇప ప్రైమరీ. మిడిల్‌స్కూలు, హైస్కూలు విద్యలు అని పేర్కొనబడుచున్న యొక్క స్థానము నాక్రమించవలయును.

"మీరు సెకండరీవిద్య అని మరియు విద్య ఏమిటి? పాపము విద్యార్థి తమ మాతృభాషద్వారమున ఏ రెండేండ్లలోనో నేర్వగలదానిని విజాతి భాష మున యేడేండ్లు నేర్చుకొన బలాత్కరించునదియేగదా? మీరు మనస్సును ని పఱచుకొని పరభాషద్వారమున విషయగ్రహణము గావించు దుర్భరభారము బిడ్డలను ముక్తులగావించి, వారి కాలునేతులను సార్థకముగ వినియోగించు నేర్ప నిశ్చయించుకొంటిరా విద్యాసమస్యయొక్క చిక్కు పరిష్కార మయిన

"వచ్చియు రాని ఆంగ్లము, గణితము, భూగోళశాస్త్రము, చరిత్రను గూర్చిన మిడి జ్ఞానము కన్న హెచ్చుగ నేమియు మనబిడ్డలు హైస్కూళ్లలో నేర్చుట నా దృఢవిశ్వాసము. వీనిలో కొన్నింటిని ప్రాథమిక తరగతులలోనే, తమ వ

భాష ద్వారమున నేర్పియే యుంటున్నారు. మీ రిప్పుడు నేర్పువిషయముల నేమియు తగ్గింపకయే పాఠ్యక్రమమునుండి ఆంగ్లమును మాత్రము తొలగించితి రేని ఇప్పటి వలె పదునొకండేండ్లకు మారుగా యేడేండ్లలో ఆ సర్వమును మన బిడ్డలు నేర్వగలరు సుడీ! ఇంతియే కాక వారికి చేతిపనియు నేర్పవచ్చును. దానితో వారు దొరతనమునకు కొంత ప్రతిఫలమును కూడ నొసగజాలుదురు"

ఈ యంశమును గుఱించి వార్ధాపాఠక్రమమును పరిశీలించినను, శ్రీ గాంధీమహాత్ముడు విద్యాసభలోచెప్పినఉపన్యాసమును పఠించినను సమగ్రముగా తెలియగలదు.

## విద్యాబోధనతరగతులు

ప్రస్తుతము యేర్పాటైయున్న తరగతులవిభజన కన్న వార్ధావిధానమున చూపట్టు తరగతులవిభజన భిన్నముగ నుండును. ఆ యేర్పాటు చాల లాభకర మని శ్రీగాంధీ మహాత్ముడు విశదముచేసియున్నాడు.

"విద్యార్థి ప్రధానాప్రధానాంశముల గుర్తించుశక్తిని కొంచెము అలవరచుకొని తన అభిరుచిని పెంపుచేసికొనునాడు వఱకు భాషాలిపిని నేర్పుట నాపి యుంచ వచ్చును. ఇది విపరీతవిప్లవప్రతిపాదనగ తోచవచ్చును. కాని ఇందువలన బిడ్డలకు శ్రమ చాల తగ్గును. వారొక్క యేడాదిలో ఇప్పు డంతకు మించి చాలకాలములో నేర్చుకొనునంత నేర్చుకొనజాలుదురు.

ఇట్లనుటచేత వ్రాయుట చదువుట మూలమున శిక్షణ గఱపు పనిని చిట్టచివరి వఱకు ఆపిపెట్టవలయు నని నేను ప్రతిపాదించుటలేదు. ఇందుకు మారుగా ఆ శిక్షణము ప్రప్రథమముననే ఆరంభమగును. సామాన్యవిజ్ఞానమున దానికి ప్రధానస్థానము గల దనుట యథార్థమే. చదువుట కొంచెము ఆలస్యముగను వ్రాయుట చిట్టచివ అకును రావచ్చునని చెప్పియున్నాను. ఈ మాట నెన్నిసార్లైనను చెప్పుచుందును. కాని ఈ కార్యమంతయు మొట్టమొదటి సంవత్సరకాలము లోపలనే జరుగవం యును సుడీ! అందుమూలమున ఈనాటి ప్రైమరీస్కూలులోని బాలుడు గాని బాలిక గాని మొదటి సంవత్సరములోనేర్చుకొన గలుగు సామాన్యవిషయజ్ఞానమును మించి నేనూహించుచున్న పాఠశాలలోని బాలుడు గాని బాలిక గాని అనగా, ఏడేండ్ల బిడ్డ ఒక యేడు గడచునప్పటికి చాల హెచ్చుగా నేర్వగల్గును. తప్పులు లేకుండ చదువగలుగును. పిల్లలు ఇప్పుడు వ్రాయు చిక్కిరి బిక్కిరి వ్రాతలకంటె, సిద్ధుష్ట ముగా అక్షరములను చిత్రింపగల్గుదురు, అప్పటికే బిడ్డలు తేలిక కూడికలు తీసి వేతలు ఎక్కములు నేర్వగలుగుదురు. * * *

“నా విధానము ననుసరించుచో, అక్షరాలను దిద్దుటకంటెను చిత్రలేఖనము కంటెను ముందుగా పనిముట్లను పట్టుకొను నేర్పు చేతి కమరును. జీవితములో ఇతర విషయములను నేర్చుకొనునటులనే అక్షరములయొక్కయు మాటల యొక్కయు చిత్రములను కన్ను చదువనేర్చును. వస్తువుల పేరులను, వాక్యముల అర్థమును చెవి గ్రహింపనేర్చును. శిక్షణమంతయు స్వభావసిద్ధముగా నుండును. ఉల్లాసవంతముగా నుండును. కాబట్టి దేశమున గలవాని యన్నింటను ఈ శిక్షణ విధానము మిక్కిలి సత్వరమైనదియు చౌకయైనదియు నగును. నా పాఠశాలలోని బిడ్డలు వ్రాయుటకన్న త్వరితముగా చదువ నేర్తురు. వారు వ్రాయ ప్రారంభించు నప్పుడు నే నిప్పుడు గిలుకునటుల అకులు పెట్టక తాము చూచు వస్తువుల ఆకృతులను చక్కగ లిఖింపగల్గుదురు. నే ననుకొను పాఠశాలలే ఎన్నడైన నెల కొలుప బడునెడల చదువుట విషయములో మట్టుకు త్వరితగతిలో [ఇప్పటి శ్రేష్ఠ తమ పాఠశాలతో పోటీకి నిలువజాలును. వ్రాత చాలకీ నాడు తప్పులు కుప్ప లుగ నున్నది. అటుల గాక నిర్దోషముగ నుండగోరుపట్ల అందుసహితము పోటీకి నిలువగల్గును.”

## వస్తువులను దొరతనమువారు కొనవలెను

బడిపిల్లలు సిద్ధముచేయు వస్తువులను దొరతనమువారు కొనవలయు నను పద్ధతి అపూర్వమైనది, ఇది సులభముగా అర్థము కాదు. శ్రీ గాంధీమహాత్ముని ప్రతి పాదమునను వివరించుదముగాక. “ఈపాఠశాలలలో తయారగు సరకును దొరతనము వారు తీసికొను పక్షమున ప్రతిపాఠశాలయును స్వయంపోషక మగును.

ఇందు కొంత ప్రత్యేక కేంద్రాలయమును నిర్మాణముచేయవలసియుండును గదా యనిన దొరతనమువారే తమ యుపయోగార్థము ఆ సరకులలో చాలవరకు విని యోగము చేసికొనదగును.

* * * దేశములో అనుకూల పరిస్థితులను మంత్రులు సమకూర్చుచో ప్రజలే హెచ్చు ఖరీదుల నిచ్చికూడ బడులలో తయారగు సరకులను కొనుచుండ గలరు. ఈరీతిగా వాని అమ్మకములో గలుగు చిక్కు తీరిపోవును. గుడ్డవిషయములో దొరతనమువారి కవసరమగుదాని నంతను హెచ్చువెల నిచ్చియైనను బడులనుండియే కొందు రని నా యాశ. యరవాడ జైలులోని ముద్రణాలయము సంగతి చూడుడు. వారి రేట్లు తక్కిన స్థానికము లగు ముద్రణాలయములరేట్లకంటె హెచ్చుగ నున్నను

కూడ గవర్నమెంటువారు తమ అచ్చుపని నంతను అక్కడనే చేయింతురు. మన పనియు అదే తీరున జరుగవలయును."

దేశములోని పాఠశాలలను పోషించు భారము గవర్నమెంటుమీదకలదు. కావున వార్ధాపాఠశాలలు నెలకొల్పబడునప్పుడు దొరతనమువా రీవిషయమున తోడ్పడగల ఏర్పాటులను ఆలోచించి చేయగలరు.

## జీవన పరిస్థితుల కనుసరణము

ఈ జాతీయవిద్య జీవన పరిస్థితులకు అనుసరణముగా నుండవలయును. ఇప్పటి విద్యావిధానములో ఈ లక్షణ మేమాత్రమును గోచరించదు. భౌతిక పరిసరములకు సాంఘిక పరిస్థితులకు వృత్తికర్మకు అనుగుణ్యమగు విద్యాప్రణాళికను నిర్మించుటకై కమిటీవారు శ్రద్ధతీసికొనిరి. కాన నూతన పాఠశాలలో కర్మప్రవృత్తిఅనుకూలమగు విద్యాపద్ధతు లుండును గాని ఇప్పటివలె కేవలము వార్తలను తలలో క్రుక్కిపెట్టు జూచు చదువుల ప్రోవు లుండవు. సాంఘిక విషయ విజ్ఞానమునకును సామాన్య శాస్త్రములకును అనుబంధ ముంచుతీరున కమిటీవారు పాఠ్యక్రమము నేర్పాటు చేసియున్నారు. విషయవిజ్ఞానమును బోధించుటలో పరస్పర సంబంధమును కూర్చుటే గాక, బిడ్డలయొక్క గృహములు గ్రామములు అందలి వృత్తులు కళలు మున్నగు సాంఘికవాతావరణమునకు సంబంధించిన బోధనాంశముల నేర్పాటు చేసిరి. అందువలన చురుకుగా విజ్ఞానమును గలుచుటే గాక బిడ్డలు తమ విజ్ఞాన సాహాయ్యమున తమ సాంఘికపరిస్థితులను బాగుగ బరిశీలించి తెలిసికొని వానిని నియమించుటకును ప్రయత్నము చేయగలుగుదురు.

## పౌరధర్మము

వార్ధావిధానము పౌరధర్మమునకు అగ్రస్థానము నొసగుచున్నది. ఇప్పటి బడులలో దీని కుచితస్థానము లేనే లేదు. అభినవ భారతమున పౌరధర్మము పూని ప్రతివాడును సంఘమున ప్రజాస్వామ్యముల సంరక్షింపవలసి యుండును. దేశాభ్యుదయమునకు ఉపకరించు ఆర్థిక రాజకీయసమస్యలందును పౌరుల అధికారము హెచ్చుగ పాటింపబడవలయును. ప్రతివారును తమ ప్రత్యేక పరిస్థితులనేగాక సమష్టిసమస్యలను అధికారములను విధులను గుర్తించి వర్తించవలయును. ఇందుకు దగిన పునాదులు ప్రాథమిక విద్యావిధానమును నిర్మితములై యుండవలసిన ఆవశ్యకతను జాకీరు కమిటీవారు వ్యక్తపరచు చున్నారు. వారి రిపోర్టున ఈ క్రిందివాక్యములు గమనింప దగినవి.

" * * * మఱియు నీ కాలమున బుద్ధిమంతుడగు ప్రతి పౌరుడును ఏదో కృషియందు నియుక్తుడై నాగరికమున సుశిక్షితమును నగు సంఘమునకు ఏదో రూపమున సేవయొనర్ప దగియుండవలయును. శ్రీమంతులైనను పేదవారైనను సంఘమునకు చీడపురుగులుగను భారమిచ్చువారుగను ఉండునటుల వారిని తయారుచేయు విద్యావిధానము గర్హ్యము, అట్టి పద్ధతివలన సంఘము నందలి నిర్మాణశక్తి నశించుటయేగాక జాతికి అపాయకరమును అవినీతికరమును నగు మానసస్థితి యేర్పడును. మా విధానము అందులకు ప్రతిగా మానవుల కుపయోగించు ప్రతికృషియు పాకీపనితోసహా గౌరవభాజన మను తలంపు గలిగి నిర్మాణ క్రియాశూరులై తమ కాళ్ళపై తాము నిలువబడశక్తులగు ఉత్తమపౌరులను తయారు చేయ సమకట్టుచున్నది."

ఈ భావము అత్యంతము పాటింప దగినదని వేరుగ వాదించుట అనవసరమగును. ఈ విధానము మేము మొదటనే సూచించినటుల భారతదేశమునకు అపూర్వము కాదు, "సర్వం ఖల్విదం బ్రహ్మ", "ఈశావాస్యమిదగ్ం సర్వం", "అహమాత్మా * * — సర్వభూతాశయస్థిత", అని తత్వవేత్తలచేతను అవతారములచేతను ప్రకటింపబడిన ఈ పుణ్యభూమియందు వృత్తులకు హెచ్చుతగ్గులు కల్పించి కొన్నిటిని గర్హించు దుస్థితి ఇటీవలి దుర్దశయే. పరదేశపు పోటీవలన దేశీయ వృత్తులు క్షీణింపగా ప్రజలు జీవనోపాధిని గోల్పోయి అల్లాడు పరిస్థితులలో విదేశపుచదువుల వలన కొందఱికి ధనలాభమును గౌరవమును అధికారపదవులును లభించినవి. శరీరము అలయకయే వీర లనుభవించు సుఖముల జూచి భ్రాంతులైన ప్రజలు తుదకు వీరినే ఆదర్శపురుషులుగ మన్నింపజొచ్చిరి. వ్రాయసగానికి గౌరవము ఎక్కువ, వ్యవసాయమునకు గౌరవము శూన్యము. స్వప్నదర్శకునకు పూజ్యత హెచ్చు, వస్తునిర్మాణమునకును పూజ్యత సున్న. కబురులుచెప్పువానికి రాబడి అమితము, కాలు సేతులతో పనిచేయువానికి ప్రతిఫలము పూజ్యము. ఇటుల పరిస్థితులు తారుమారైనవి. ఏ శుభకార్యములందుగాని, ఏసందర్భములందైననుగాని, అందుపకరించు సాధనమును ప్రారంభమున పూజించు నాచారము భారతీయులందు నేటికిని కలదు. ఉపనయనకాలమునందు క్షౌరకర్మసమయమున ఉత్తమ వర్ణములవారు సయితము మంగలి కత్తిని పూజించి మంగలికి వస్త్రదానముచేయుదురు. పెండ్లిండ్ల కాలమున ముందుగ డప్పువాయించు హరిజనునకు తాంబూల మిత్తురు. గృహ నిర్మాణకాలమున మున్ముందుగ మూలగాతినిస్థాపించి దానిని పూజింతురు. కాళ్ళపని

వానికి బహుమతులను నిత్తురు. నడి దూలము లెత్తునప్పుడు వానికి ఆరాధనచేతురు, వడ్రంగికి కానుకల చెల్లింతురు. వస్తు వదృశ్యమైనది: దాని నీడ మాత్రము నిలిచి యున్నది.

వృత్తిగౌరవమునకు మఱొక నిదర్శనము. సకలవృత్తులకును విశ్వకర్మ అనగా దేవశిల్పి అధిష్ఠానదేవత. వాని సంతానముగా అయిదుగురు బ్రహ్మలు ఉద్భవించిరి. వీరివలన అయిదుగురు ఋషులు భూలోకమున నవతరించిరి. వీరివలన కమ్మరము, వడ్రము, కంచరము, కాశ్యము. స్వర్ణవృత్తి ప్రపంచమున సాగింపబడినవి. ఇవన్నియు అత్యంతపావనము లగు బ్రాహ్మణవృత్తులని శాస్త్రములు ఘోషించుచున్నవి. ఈ సంవత్సరమున చెమటకోర్చి అతికష్టముతో నిర్వహించి, స్వల్పలాభమును బడయు కమ్మరికి ప్రథమ గౌరవస్థానమును, సుఖలాలసుల కుపకరించు సుకుమార స్వర్ణశిల్పికి కడపటి పదవియు నొసగ బడియుండుట ముఖ్యముగ గమనింపగాక, ప్రతి వృత్తికిని సంబంధించిన వేదములు, తంత్రములు, ఆగమములు ఎన్నియో కలవు. ఆ యా వృత్తుల నవలంబించువారు ఆ యా శిక్షణాలయములందు ఉపనయనకర్మ చేసికొని ప్రవేశించి వేదవిద్యతోపాటు వృత్తివిద్య నేర్వవలయు నను శాస్త్రనియమము కలదు. ఇటుల వృత్తులకు గౌరవము, శిక్షణాలయములకు మాన్యత, శిక్షణాచార్యులకు పూజ్యత సుస్థాపితమై యుండిన భారతభూమిలో నేడు గవర్నమెంటు ఆఫీసులో దాస్యముచేయువానికి గణ్యత, వస్తునిర్మాణముచేసి దేశ సౌభాగ్యమును సృష్టించువానికి న్యూనత యేర్పడినది. శ్రీ గాంధిమహాత్ముని తపః ఫలముగా వార్ధావిధానరూపమున ప్రాచీన విద్యాశిక్షణాలయములు దేశమున నెల కొని పవిత్ర విద్యలతో గూడిన వృత్తులు ప్రవర్ధనమై విశ్వకర్మ పరాత్పరుని అనుగ్రహమునకు పాత్రత మఱల లభించు సూచనలు గోచరింప నగుచున్నవి.

# చతుర్థ పాదము

## నిదర్శనము

మధ్యరాష్ట్రమునందలి వార్ధానగర సమీపమున శేగాము యను పల్లెయందు తప మొనరించుచున్న శ్రీగాంధీమహాఋషికి విశ్వకర్మభగవానుడు అభినవ కర్మయోగ మనం దగు వార్ధాశిక్షను బోధించినాడన దగును. సత్యాహింసలు దీని మూల సూత్రములు. సత్యము వలన తనలో ఆత్మదర్శనము చేసి విద్యార్థి తాను త్రిగుణుడు కాగలడు. అహింసావ్రతము వలన పరుల కష్టార్జితమును పరిగ్రహము చేయక వారి యెడ ఏ తీఱునను అన్యాయముచేయక సర్వభూతాంతరాత్మను సేవించి ముక్తుడు కాగలడు. ఇదంతయు సిద్ధాంతదర్శనమున వచ్చును. నిదర్శనములు ఎచ్చోనైనను చూపట్టునా ? అను ప్రశ్న నిక విచారింతము.

వార్ధావిద్యాసభయందు ఈ విధానము శ్రీ గాంధీమహాత్మునిచేత ప్రతిపాదింపబడి నది. కావున ఆరాష్ట్రప్రభుత్వమువారు నిదర్శనముల చూడవలసినబాధ్యతను వహిం చుట సమంజసము. కాబట్టి ఆ ప్రభుత్వమువారి పూర్తి సహాయసానుభూతులతో వార్ధాలోనే వార్ధావిద్యావిధానము సూచించు తెఱగున ఒక ట్రైనింగుస్కూలును (ఉపా ధ్యాయశిక్షణాలయమును), ఒకప్రాక్టైజింగుస్కూలును (అనుష్ఠానమును నేర్పు విద్యా లయమును) నెలకొలుపబడినవి. వీని నిదర్శనము మనకు రెండు విధముల నుపక రించును. జాకిరుకమిటీవారి సూచనలను ఏతీరున ఆచరణలో ప్రారంభముచేయ వచ్చునో గ్రహించవచ్చును. ఇతరరాష్ట్రప్రభుత్వములవారును ఏ తీరున సహాయ ప్రోత్సాహము లిచ్చి యిట్టి పాఠశాలలను నెలకొలుపవచ్చునో తెలియనగును.

### ట్రైనింగుస్కూలు

మధ్యరాష్ట్రప్రభుత్వమువారు పూర్వ మున్న నార్మల్‌స్కూలును వార్ధాలోనున్న ట్రైనింగుస్కూలుగా మార్చిరి. దాని కిప్పుడు " విద్యామందిరట్రైనింగుస్కూలు " అని పేరిడిరి. విద్యామందిరము లనుపేర తాము స్థాపించు వార్ధాపాఠశాలలయందు విద్య గఱపుటకు అర్హులగు ఉపాధ్యాయులను తయారుచేయుటే వారి యుద్దేశ్యము. విద్యామందిరముల వివరము వేఱొకచో నీ గ్రంథమును చూడనగును.

ఈ విద్యామందిర ట్రైనింగుస్కూలు పరిపాలన కొఱకును దానింగూర్చిన సల హాలను గవర్నమెంటువారికి తెలుపుటకొఱకును ఒక కమిటీ ఏర్పాటు చేయబడినది.

ఈ కమిటీలో నలుగురు ఉద్యోగులును అయిదుగురు ఉద్యోగేతరులును నియమింపబడిరి. ఈ కమిటీయొక్క పరిపాలనక్రిందనే ట్రెయినింగుస్కూలు నడుచుచున్నది.

వేర్వేఱు రకములవారికి శిక్షణ గఱపుటకై వేర్వేఱు శిక్షణాప్రణాళికలు కల్పింపబడినవి. ప్రారంభమున రెండువారములపాటు కొలదిపాటి శిక్షణక్రమము నేర్పాటు చేసిరి. వాయవ్య సరిహద్దురాష్ట్రదొరతనమువారిచే పంపబడిన నలుగురు ఉద్యోగులు, బీహారు రాష్ట్రప్రభుత్వము పంపిన ఇద్దఱు ఉద్యోగులు, ఒరిస్సారాష్ట్రప్రభుత్వము పంపిన ముగ్గురు ఉద్యోగులు, బొంబాయిప్రభుత్వము పంపిన అయిదుగురు ఉద్యోగులును, వార్ధా ట్రెయినింగు స్కూలు ఉపాధ్యాయు లందఱును హాజరైరి. చెన్నరాజధానినుండి తిన్నెవెల్లి జిల్లాబోర్డువారిచే పంపబడిన యొకరును, కోయంబుత్తూరుజిల్లా శ్రీరామకృష్ణమిషనువారిచే పంపబడిన మఱొకరునుకూడ హాజరైరి. అచ్చట బోధింపబడిన విషయములలో (1) వార్ధావిధానమునకు మూలాధారములగు సూత్రములు (2) ట్రెయినింగుస్కూళ్ళను ఏర్పాటుచేయు పద్ధతి (3) పాఠ్యక్రమములను సిద్ధముచేయుట అనునవి ముఖ్యమైనవి.

ప్రాతపద్ధతి ప్రకారము ట్రెయినింగై ఇదివఱకే కొంత బోధనానుభవము గల ఉపాధ్యాయుల కొకటి, వార్ధావిధానముయొక్క ఉద్దేశ్యము నామోదించి ఆప్రణాళికయందుత్సాహము చూపువారలకు మఱియొకటి—రెండు ట్రెయినింగుశాఖ లేర్పరుపబడినవి. ఒకశాఖలో వార్ధావిధానానుసారము బోధించుసామాన్యసూత్రములు, ఆపద్ధతియొక్క భావవైఖరి, మఱియు వడుకుట, అట్టలతో వస్తువులు చేయుట యను వృత్తివిద్యలు నేర్పబడినవి. గణితమునకు సామాన్యశాస్త్రవిషయములకు వృత్తిపనులతో అనుబంధము ఎట్లు కూర్పనగుచో బోధింపబడినది.

రెండవశాఖలో నింకను వివరములతో ఆ యా విషయములు నేర్పబడినవి. ఇందులో మధ్యరాష్ట్రప్రభుత్వము వారిచే నెన్నుకోబడిన ఉపాధ్యాయులుగా నుండబోవు విద్యార్థులు 160 మంది చేరిరి. వీరిని ఆరుతరగతులుగా విభజించిరి. వీరికి ఎనిమిది నెలలలో ప్రత్యేకశిక్షణ మీయబడినది. వార్ధాపాఠశాలలలో మొదటి రెండు తరగతులకు బోధించుటకు వీరు అర్హులుగ నుందురు. వీరు ఈ శిక్షణానంతరము గవర్నమెంటువారి విద్యామందిరములో రెండు సంవత్సరములపాటు పనిచేసి తిరిగి వచ్చి ఒక సంవత్సరము శిక్షను బొందుదురు. అప్పుడు వీరు నాలుగు తరగతులకు బోధింపగలుగుదురు. ఇట్లు క్రమేణా ఉపాధ్యాయులకు శిక్షణ మేర్పాటు చేయబడుచున్నది.

## ప్రాక్టైజింగు స్కూలు

ప్రాక్టైజింగుస్కూలు అనగా ట్రైనింగుస్కూలులోని మాదిరి బడి. ఇందు ఏడు తరగతు లున్నవి. వీనిలో మొదటి రెండుతరగతులు మాత్రము వార్ధావిధానమున నడుపబడుచున్నవి. తగిన ఉపాధ్యాయులు దొరకు కొలది తక్కిన తరగతులను వార్ధా విధానము ననుసరింపజేతురు. మదరాసు రాష్ట్రవిద్యాశాఖామాత్యుడు వారేకరుగారు అచ్చటి బోధనాక్రమమును గురించి యిటుల తెలుపుచున్నారు :

"నేను చాలసేపు మొదటితరగతిలో బోధ జరుగుచుండగా కనిపెట్టి చూచితిని. ఉపాధ్యాయుడు వడుకుటను నేర్పుచున్నాడు. తక్లీమీద వడికించుచు దానితోపాటు మాతృభాషను, లెక్కలను, భూగోళమును అనుబంధపఱచి పిల్లలకు చెప్పుచుండెను. ఆపిల్లలు 18 మంది ఏడేండ్లవయసువారు. వారందరు చురుకుగాను ఉత్సాహముగాను నేర్చుకొనుచున్నారు. వారికి వ్రాత నేర్పి యుండలేదు. కాని వారు బోర్డుమీది అంకెలను గుర్తుపట్టగల్గియున్నారు. తాము వడుకు నూలుయొక్క నెంబరును లెక్కవేయగలరు. తాము ఒకటి, రెండు, మూడు దినాలలో వడకగల నూలు మొత్తమును బోర్డుమీద అంకెలను చూపి సూచింపగలుగుచుండిరి. కొంతసేపటికి సంగీతము పాడ నారంభించిరి. తరువాత అనుబైట పాటలు పాడుచు ఆటల సాగించిరి. క్రియాపూర్వకపాఠ్యక్రమ మన నేమో నేను బాగుగ గ్రహింపగల్గితిని. పిల్లలందఱు సంతోషముగను ఉల్లాసముగను చురుకుగను నుండిరి. వార్ధావిధానమును విమర్శించువారు ఆరోపణచేయు 'బాలురశ్రమ' 'ఫ్యాక్టరీకూలిపని' అనెడు కీడులేమియు నాకు గోచరించలేదు.

### ప్రయోజనకర మగు చేతిపని

"ఆ నూజట్టులవారు తయారు చేసిన చేతిపనుల ప్రయోజన స్వభావమును పరీక్షించితిని. ఆ విధానమును హర్షించు నావంటివానికి సయితము ఆశ్చర్యమును గొలుపు లెక్క చేకూరినది.

"ఉపాధ్యాయులుగా తరిపీదుపొందు విద్యార్థుల తరగతివారు అట్టలతో పనిచేయు శాఖయందు సగటున దినమునకు రెండు గంటలపని జరుగును. అక్కడ శిక్షణ పొందు విద్యార్థి నెలకు తేల్చగల నికరమగు లాభము ఒక రూపాయి. అట్టలు మొదలగువాని ఖరీదు నష్టమైపోయిన భాగము అంతయు తీసివేయగా తేలినదే ఆ నికరలాభము. వారు 750 మాదిరులు తయారు చేసినారు. అందులో 650

అప్పటికే ప్రేక్షకులకు అమ్ముడు పోయినవి. అందువలన వచ్చిన మొత్తము 125 రూపాయలు. వారు తయారుచేసిన వస్తువులు సొగసగు ఆకృతులు గలిగి ఉపయోగకర మగు వస్తువులుగ నున్నవి. అవేవన—వేర్వేరు పరిమాణములు రూపములు గలిగి రంగులు పూవులు గల ఖద్దరు తొడుగులతో అలంకరించిన పెట్టెలు, అద్దుడు కాగిరాల అట్టలు, ఉత్తరాల అట్టలు, ఆఫీసుఫైలు పుస్తకాలు, పోర్టుఫోలియోలు, ఫొటోలుంచు పుస్తకములు, పుస్తకాలకవరులు, కలాలుపెట్టెలు, పెన్సిలులు,గుండుసూదులు పెట్టుకొను పళ్లెరములు మొదలగునవి. దీనిని పట్టి వార్ధాపాఠశాలలు ఆ రాష్ట్రి మంతటను నెలకొనునప్పుడు అందలి అట్టపనులశాఖ వలన రాష్ట్రిమందంతటను ఆ గవర్నమెంటువారి ఆ యా కార్యాలయము లన్నింటికిని కావలసినఅట్టల వస్తువు లన్నియు సప్లైచేయగలుగు నని లెక్క వేయబడుచున్నవి.

"ప్రాక్టైజింగుస్కూలులోని, ఏడేండ్లు అంతకు పైబడిన వయసు మొదటి తరగతి పిల్లలు నన్నాశ్చర్యానందమున దేల్చినారు. జాకీరు హుస్సేను కమిటీవారి అంచెనా ప్రకారము తొమ్మిది నెలలు వడుకుటను నేర్చిన అనంతరము ప్రతి విద్యార్థియు, సంవత్సరమునకు 28 దినములు పనిచేసి రు 2-9-0 మాత్రము సంవత్సరపు సంపాదన చూపగలదనిరి. ఈ బడిలో మొట్టమొదటి తరగతిలోనే దినమునకు గంటన్నర పనితో నెలకు 23 దినములు చొప్పున సంవత్సరము మీద 270 దినాలకు సగటు ఆదాయము ఒక్కొక్కనికి రు 3-0-0 తేలినది. విద్యార్థులు, ఉపాధ్యాయులు హెచ్చు అనుభవమును వాకచక్యమును గడించిన కొలదిని ఇంతకన్న చాల ఎక్కువ రాబడి తీయగలరనుట సహజమేకదా ! ఆరు ఏడు తరగతులు స్వయంపోషకము లగుటకు మించిన ఆదాయమునే చూపును. ఏడు సంవత్సరముల పూర్తి శిక్షణమును పాటించునెడల శ్రీ గాంధీమహాత్మ డాశించు విధమున ఉపాధ్యాయుల జీతమునకు సరిపోవు రాబడిని సమకూర్చునంత మట్టుకు ఈ విద్య చక్కగ స్వయంపోషకము కాగలుగును.

## విద్యార్థుల ప్రావీణ్యము

"విద్యార్థుల ప్రావీణ్యమును చూతుమా ? ఈ విద్యార్థులు మునుపటి పద్ధతిని తయారైనవారికన్న ప్రవీణులనుటకు సందియ మిసుమంతయు లేదు. విషయ విజ్ఞానమందా, మునుపటివారికన్న మిన్నలు కా రన్నను వారితో సము లనుట నిశ్చయము. చదువులందు చూపు ఉల్లాసము, ఏకాగ్రచిత్తత, కార్యశూరత, చురుకు

దనము, ఆరోగ్యముల విచారింతమా ఈ విద్యార్థులు తప్పక అధికు లని ఒప్పుకొన వలయును.

"పద్ధతివలన గలుగ గల లాభములలో ముఖ్యము లని నాకు దోచినవి చెప్పెదను :

(1) చదువుట, వ్రాయుట- చిత్రలేఖనము, మాతృభాష, బహుహృద్యమగు మార్గమున ఈ పిడ్డలు నేర్చుకొనుచున్నారు. మఱియు వారి చిట్టిచేతులు తక్లీతో చుఱుకుగ పనిచేయుచున్నవి. ఎంతటి వ్యత్యాసము ! మునుపటివలె వట్టి సిద్ధాంతముల రూపమునను ఉత్సాహము గొలుపని పద్ధతిలోను విజ్ఞానము నుపార్జనముచేయుటకు మారుగా ప్రయోజనకరమగు విషయ విజ్ఞానమును వారి మనస్సులలో చక్కగ అమర్చిపెట్టుచున్నవో అనునటుల పిల్లలచేతులు, కండ్లు, వారి మెదడును కాన్పించినవి. పఠనము, గానము, సంభాషణము, నాటకము, హస్తకర్మ, ఆటపాటలు అన్నియు నుపయుక్తములుగ కూర్పు చెందింపబడినవి. అందువలన వృత్తిక్రియలు చేయు సమయముల నడుమ బాలురకు పనిలో మార్పు, చేతులకు విశ్రాంతి అమరుచున్నవి.

## శిక్షణ వైఖరి

శిక్షణవిషయ మందుమా, ఓహో! ఇప్పటిపద్ధతికి ఎంత భిన్నము ! ఈనాడు ఉపాధ్యాయుని - ముఖ్యముగా చిన్నితరగతుల ఉపాధ్యాయుని కాలమున శ్రద్ధయు పిల్లలను ఇటునటు చంచలించకుండ సుస్థిరముగ కూర్చుండచేయుటలోనే వ్యర్థమగుచుండెను. వార్ధావిద్యాలయమున బలాత్కారపు శిక్షణకుగాని, చివాట్లుపెట్టుటకు దండించుటకు గాని అగత్యమే లేదు. బాలురు సహజముగ చకచకలాడుచుందురు వారు అల్లరికి మరిగిరేని వారి బాల్యోత్సాహమునకు ఇప్పటి విధానము తిన్నని అవకాశము చూపజాలకపోవుటచేతనే ! చేతులు ముడుచుకొని కూర్చుండి నిరంతర యుపాధ్యాయుడు చెప్పుచుండుదానిని వినుచుండుట యన అస్వాభావిక విషయము వార్ధాపాఠశాలలో వారి చేతిపని వారి కార్యోత్సాహమునకు అవకాశము చూపుచున్నది. అందువలన తమకు తెలియకుండనే క్రమశిక్షణమును శాంతిని పోషించుటలో ఆ బాలకులు ఉపాధ్యాయునికి తోడ్పడుచున్నారు. మామూలుగా గోచరించు సోమరి అల్లరిపిల్లలకు మారుగా తరగతిలోని వారందఱును కార్యపరులును శ్రద్ధాళురును నై కాన్పించిరి. ఆ కార్యపరత్వము ఆ శ్రద్ధయు బహుస్వభావజన్యమును అప్రయత్నసిద్ధమును సుడీ !

“అప్పుడు నాతోడనుండిన కెంటు (ఇంగ్లాండు) మండలమునందలి టన్బ్రిడ్జివెల్సు పట్టణపు సెంట్ క్రిస్టఫర్సు నర్సెరీట్రైనింగుకాలేజి అధ్యక్షురాలగు ఆంగ్లనారీమణి వింతచెంది “ఈ వార్ధావిధానము ‘మాంటెసోర్రా’ పద్ధతికన్న చాల శ్రేష్ఠతరమైన”దని పలికినది. ఏమాత్రమును దురభిమానము లేక స్వతంత్రముగ పరిశోధింపగల ఈ దొరసాని సాక్ష్య మెంతయు విలువగలది గదా!

## ఉపాధ్యాయవృత్తికి శిక్షణబడయు విద్యార్థులు

“ఇచ్చట ఉపాధ్యాయవృత్తికై శిక్షణ బడయుచున్న విద్యార్థులందును అద్భుతమగు పరివర్తనము గోచరించినది. అసమర్థుడగు ఉపాధ్యాయుడు సయితము ఈ వార్ధా విధాన శిక్షణమునందు సమర్థుడుగ మారుచున్నాడు. ఈ నూతన శిక్షణ విధానమే ఉపాధ్యాయునికి శ్రేష్ఠతమ జ్ఞానదాయినియై ఒప్పుచున్నది. మెదడుతోడను చేతితోడను కంటితోడను పనిచేయుటచే వాని విశిష్టవ్యక్తిప్రధానము విస్తృతమగుచున్నది. ఈ విధానమున శిక్షణ బడయువారు జాగరూకులు, చురుకు గలవారును, ఉత్సాహవంతులును, శ్రద్ధావంతులును అగుచున్నారు. ఇంతేగాక ఈ శిక్షణ క్రమమున బడి అతడు తనకు తెలియకుండగనే తన వృత్తియందును తన తోడి విద్యార్థులందును అనురక్తిగలవాడగుచున్నాడు. * * *

“ఈ విధానము జయప్రదమగునా కాదా యనియు, వందలకొలదిగా నెలకొల్పిన వార్ధావిద్యాలయములకు వలయు ఉపాధ్యాయులు వేలకొలది లభింతురో లేదో యను సంశయముల బాపుటకు ఈ నిదర్శనము చాలదా?”

కేవలము పక్షపాతబుద్ధితో దురభిమానము వహించి యథాతథముగా ప్రత్యక్షానుభవములను స్వీకరింపని సంశయాత్ములకు తప్ప ఈ వార్ధావిద్యావిధానము ఇప్పటికి చూపగల నిదర్శనములు సంతృప్తినొసగియే తీరును.

## విద్యామందిర పాఠశాల

విద్యామందిర పాఠశాల, వార్ధాపాఠశాల అను పదములు ఈ గ్రంథమున పలుసారులు వాడబడియున్నవి. వాని అర్థమును విశదీకరింతుముగాక.

ఇంతవరకు వ్రాసినదానినిబట్టి వార్ధాపాఠశాల యనగా జాతీయ ప్రాథమిక విద్యకొఱకుగాను వార్ధావిద్యాసభవారిచేతను జాకీరు హుస్సేనుకమిటీవారిచేతను ప్రతిపాదింపబడిన పాఠ క్రమము ననుసరించి నడుపబడు పాఠశాల యని స్పష్టపడియే యుండును. అట్టివి గవర్నమెంటు, లోకల్ బోర్డు, లేక ఏఇతరకమిటీయో వ్యక్తియో

స్థాపించి పోషించునదిగ నుండవచ్చును. అటువంటి పాఠశాలలను పరిపాలించుటకై "విద్యామందిర ప్రణాళిక" ఉద్దేశింపబడినది. విద్యామందిర ప్రణాళిక ననుసరించి పరిపోషింపబడు వార్ధాపాఠశాలను విద్యామందిర పాఠశాల అందురు.

## విద్యామందిర ప్రణాళికయొక్క విశిష్టత

విద్యామందిర ప్రణాళికయొక్క విశిష్టత ఏమున్నది ? విద్య, మందిరము అను పదముల కర్థమును విచారింపుడు. విద్య యనగా సంస్కృతమున జ్ఞానము అని అర్థము. మందిరము అనగా ఇల్లు, భవనము అని అర్థము. కొన్ని ప్రాంతములందు ఆలయము, దేవళము అనియు అర్థము చెప్పుచున్నారు. కాబట్టి విద్యామందిరము అనగా జ్ఞానభవనము లేక జ్ఞానాలయము అని అర్థము వచ్చుచున్నది. ఈ పేరును మధ్యరాష్ట్రప్రభుత్వమువారు పైన పేర్కొనబడిన భావముతో నెలకొలుపబడిన పాఠశాలల నిర్వహణమునకై ప్రత్యేకముగ నేర్పాటుచేసిన పాలకవర్గమునకు అనువర్తింప జేయుచున్నారు.

(1) ఏ దయాళుయొడగు వ్యక్తియో సంవత్సరమునకు రెండువందలరూపాయీల ఆదాయమునిచ్చు భూమిని దాన మీవచ్చును. ఇది విద్యామందిరపాఠశాలలోని ఒక ఉపాధ్యాయుని జీతమునకు సరిపోవును. ఈ పాఠశాలలలో ప్రస్తుతము మొదటి నాలుగు తరగతులు మాత్రమే ఉండును. మొత్తము అరువదిమంది పిల్లలు ఇద్దరు ఉపాధ్యాయులు నుండగలరు. ఒక్కొక్క ఉపాధ్యాయుడు మొత్తము ముప్పదిమంది గల రెండేసి తరగతులకు విద్య నేర్పుచుండును. వారిలో ఒక ఉపాధ్యాయుని జీతమునకు దానముగా నీయబడిన భూమిపైని వచ్చురెండువందల రూపాయీల ఆదాయము సరిపోవును, రెండవ ఉపాధ్యాయుని జీతమునకు నాలుగు తరగతుల విద్యార్థులును తయారుచేయు వస్తువుల అమ్మకము వలన సమకూడును. ఇట్టిపాఠశాల ఏడు తరగతులతోడి పూర్తిపాఠశాలగా వృద్ధిపొందునప్పటికి అప్పుడప్పు డేర్పడు 5, 6, 7 తరగతులకు విద్యార్థుల సంపాదన ఆ క్రొత్త ఉపాధ్యాయుల జీతములకు సరిపోవుచుండును. విద్యార్థుల వృత్తికౌశలము వృద్ధియగుచుండునుగాన పైతరగతులవిద్యార్థులు సంపాదించుసొమ్ము కూడ హెచ్చుచుండును.

(2) మధ్యరాష్ట్రప్రభుత్వమువారు ప్రతి తాలూకాలోను రెండేసి విద్యామందిర పాఠశాలల వంతున రాష్ట్రమంతను 160 పాఠశాలలను ప్రారంభించుటకు రెండు లక్షల రూపాయీలను ప్రత్యేకించినారు. ఈధనము అవసరమగునంతమంది ఉపాధ్యాయుల ట్రైనింగు కొఱకును, తాము నెలకొలుపు 160 పాఠశాలల భవన

ముల కొఱకును, దానమీయబడిన భూముల వలని ఆదాయము మొదటి సంవత్సరము రాదు గావున ఆ మొదటి సంవత్సరము ఇద్దఱు ఉపాధ్యాయుల జీతములకొఱకును ఉద్దేశించబడినది.

(3) దాన మీ బడిన భూమిని ఎవరికేని కౌలు కిచ్చుటకు పూర్వము మొదటి మూడు సంవత్సరములవరకు మధ్యరాష్ట్ర ప్రభుత్వమువారి వ్యవసాయశాఖవారే దానిని సాగుచేయుదురు.

(4) ఈ లోపున విద్యామందిర పాఠశాలల ఉపయోగమును బడయు ప్రతిచోటునను గవర్నమెంటువారు స్థానికముగా "విద్యామందిర కమిటీ" నొక దానిని నెలకొలుపుదురు. అట్టి కమిటీలో భూదానము చేసినవారును, ఇట్టి పాఠశాలలందభిమానముగల యితరులు కొందఱును మెంబర్లుగా నుందురు. ఈ కమిటీలు భూముల వ్యవసాయమును పాఠశాలల పరిపాలనమును చూచుచుండును. మరియు వీనినే రాష్ట్రమంతటికిని "విద్యామందిరట్రస్టు" లుగా నేర్పాటు చేయుదురు.

విద్యామందిర ప్రణాళికక్రింద నుండనీ లేక యితర పరిపాలనక్రింద నుండనీ పూర్ణమగు వార్ధాపాఠశాలలో ఏడు తరగతులు వార్ధావిధానము ననుసరించి పెట్టబడును. గవర్నమెంటువారికి ప్రస్తుతము చాలినంత డబ్బు లేకపోవుటచేతను ప్రత్యేక శిక్షణను బడసిన ఉపాధ్యాయులు చాలినంతమంది లేకపోవుటచేతను ప్రారంభముచేయకుండ ఆలసించుట గవర్నమెంటువారికి సమ్మతము కాదు కావునను విద్యామందిర పాఠశాలలలో నిప్పుడు మొదటి నాలుగు తరగతులనే పెట్టిరి. వానిలో కొన్ని పాఠశాలలందు త్వరలోనే 5, 6, 7 తరగతులను చేర్చి పూర్తి వార్ధాపాఠశాలలస్థితికి తెచ్చెదరు. నాలుగు తరగతులలో నున్న పాఠశాలలు వానికి ఆధారములుగ నుండి తమయందు త్తీర్ణులైన విద్యార్థులను వానికి బంపుచుండును. ఈ పాఠశాలలో అనేకము క్రమేణా పూర్తివిద్యాలయములుగ పరిణామము పొందును. కొన్ని మాత్రము, అనగా కొలదిపాటి జనసంఖ్యగల యూళ్లలోనివి మాత్రము పైవానికి ఆధారముగా నుండి జరుగుచుండును.

ఈ తీరున విద్యాసమస్యా పరిష్కారమునకు ప్రథమముగా పూనుకొనిన మధ్యరాష్ట్రప్రభుత్వమును ఆదర్శముగ గొని తక్కుగల రాష్ట్రప్రభుత్వములు అచిర కాలములో విద్యావిషయమున తమ ధర్మమును నిర్వహించుగాక!

## సెంట్రల్ ఎడ్వైజరీ బోర్డు ఆఫ్ ఎడ్యుకేషన్

ఈ వార్ధావిధానము యోగ్యమై జయప్రదముగ అనుష్ఠింపబడగలదనుటకు మఱొక గొప్ప నిదర్శనము కలదు. దేశమంతటను ప్రచారములోనున్న విద్యాప్రణాళికలను పరీక్షించి ఆయారాష్ట్రప్రభుత్వములకు సలహానిచ్చుచుండుటకును, ప్రధానప్రభుత్వము వారి నీతిని వ్యక్తముచేయుటకును ఇండియాగవర్నమెంటువా రొక సెంట్రలు అడ్వైజరీబోర్డు ఆఫ్ ఎడ్యుకేషనును స్థాపించియుండిరి. ఆ సెంట్రలుబోర్డువారు వార్ధావిధానమును పరిశీలించు నిమిత్తము బొంబాయిగవర్నమెంటు విద్యాశాఖామాత్యులును, ప్రధానామాత్యులునుకూడ నగు మాన్య శ్రీ బి. జి. ఖేరుగారి ఆధిపత్యము క్రింద నొక కమిటీని నియమించిరి. ఈ కమిటీవారు 1938 సం॥ జూన్ 28, 29, 30 తేదీలందు సిమ్లానగరమున చేరి వార్ధావిధానమును గాఢపరిశీలనము చేసి ఒక రిపోర్టును సిద్ధముచేసి పంపిరి. ఈ రిపోర్టును సెంట్రలు అడ్వైజరీబోర్డు ఆఫ్ ఎడ్యుకేషన్‌వారు న్యూ ఢిల్లీలో డిశంబరు 3 తేదీని సమావేశమై విచారణలోపెట్టిరి. వీరు సాధారణముగా ఖేరుకమిటీవారి సిఫారసులను ఆమోదించియున్నారు. వారి ఆమోదమును బడిసిన ఖేరుకమిటీ సిఫారసులను ఈ క్రింద పొందుపఱచు చున్నాము.

(1) ప్రాథమిక (Basic) విద్యను మొట్టమొదటగా గ్రామములందు ప్రవేశ పెట్టవలెను.

(2) ఆఱు పదునాలుగేండ్ల మధ్యవయస్సున నిర్బంధము అమలులోనుంచవలెను. అయినను అయిదేండ్ల బిడ్డలు సయితము ప్రాథమికపాఠశాలలలోనికి రా దగుదురు.

(3) ప్రాథమిక (Basic) పాఠశాలలలో నుండి ఇతర విధములగు పాఠ శాలల లోనికి తొలగి చనుటను సుమారు పదునొకండేండ్ల వయసు పిమ్మట 5 వ తరగతి గడచిన యనంతరము అంగీకరింపవలెను.

(4) ఆయా రాష్ట్రభాషలలోనే బోధలు చేయవలయును.

(5) భారతదేశమంతటికిని ఒక సామాన్యభాష యుండుట వాంఛనీయము. ఉర్దు, హిందీ, లిపుల రెంటిలో హిందూస్థానీభాషయే అట్టి సామాన్యభాషగా నుండ వలెను. ఏ లిపి నేర్చుకొనునది బిడ్డల ఇచ్ఛకు వదలివేయవలెను. ఆ లిపిలోనే వారికి బోధలు సలుపు అవకాశమును కల్పించవలయును. ప్రతి ఉపాధ్యాయుడును ఉర్దు హిందూస్థానీ లిపుల రెంటిని నేర్చియుండవలెను.

(6) పనిద్వారమున విద్య నేర్పు సూత్రమునకును వార్ధావిధానమునందలి వుడ్డు-అబట్టు రిపోర్టులోని సిఫారసులతో ఏకీభవించుచున్నది. ఈ పనులు క్రింది తరగతులలో పలు రకములుగ నుండవలయును. పై తరగతులలో ఒక ఆధారవృత్తికి మార్గము చూపవలయును. అందువలన తయారగు వస్తువులు అమ్ముడుపోవునవిగ నుండి వాని రాబడి పాఠశాల పోషణకు వినియోగపడవలయును.

(7) క్రింది తరగతులలో విద్య కర్మలద్వారమున నేర్పబడవలయును.

(8) కొన్ని సంప్రదాయిక విషయములు ఆధారముగ గొనిన వృత్తితో అనుసంబంధము కూర్ప వీలులేనివిగ నుండును. వానిని స్వతంత్రముగ నేర్పవలయును.

(9) ఉపాధ్యాయుల శిక్షణము రికగ్నైజు చేయవలయును. వారి గౌరవము పెంపొందింపవలయును.

(10) ఏ ఉపాధ్యాయునికిని నెలజీతము 20 రూపాయిలకు తక్కువ యుండదగదు.

(11) ఉపాధ్యాయులుగ స్త్రీలను హెచ్చుగ చేర్చుకొను ప్రయత్నము చేయవలయును.

(12) అర్హులగు శిక్షణ బడసిన ఉపాధ్యాయులు లభించినప్పుడే ఈ ఆధార విద్యాలయములను నెలకొలుపవలయును.

(13) అనుభవము ననుసరించి పాఠ్యక్రమమును మార్చుచుండవలయును.

(14) ఆధార పాఠశాలలందు ఆంగ్లమును ఐచ్ఛికవిషయముగను చేర్చరాదు.

(15) ప్రతి సంఘమునకు తగిన మతబోధ చేయించుటకు గవర్నమెంటువారు వసతులను సమకూర్పవలెను.

(16) బయటివారు వచ్చి పరీక్షచేయ నవసరములేదు. శిక్షణ పూర్తియైన వెనుక పాఠశాలయందే జరుపబడు పరీక్ష నాధారము చేసికొని బడి విడిచిపోవునప్పుడు ఒక విడుదల సర్టిఫికెట్టు నీయవలయును.

(17) పదకొండు సంవత్సరములు అంతకు పైబడినవయస్సు గల పిల్లలు ఇతర పాఠశాలలకు పోగోరునెడల వారికిని విడుదల సర్టిఫికెట్టు నీయవలయును.

(18) పాఠశాలలోపల జరుగు పరీక్షల ఫలితములు సూపర్వైజరు తణిఖీకి లోబడియుండినను ఒక తరగతినుండి మరియొక తరగతికి చేయు ప్రమోషనులు పాఠశాలాధికారులచే నిర్ణయించవలయును.

ఖేర్ కమిటీవారి రిపోర్టులో చక్కగా యోచింపదగిన యంశములు కొన్నిగలవు.

ఉదాహరణకు ఇంగ్లీషును గురించి వారు చెప్పునది చూతము. ఇంగ్లీషు కావలయు నని కోరు బాలురవిషయములో పదునొకండు సంవత్సరముల వయస్సు దాటిన పిమ్మట 5 వ తరగతి అనంతరము వారిని ఇంగ్లీషు నేర్పు పాఠశాలలకు మార్పుటవలన వారికి అవకాశము కల్పించవలయును. వార్ధాపాఠశాలలలో మాత్రము ఇంగ్లీషు నేర్పరాదు.

స్వయంపోషకత్వమునుగూర్చి యిట్లు వ్రాసినారు; వార్ధావిధానపు ప్రధానసూత్రము లాభదాయక మగువృత్తి కర్మద్వారమున విద్యాభ్యాసము సాగవలయుననుటే. కాని "లాభకర మగు" ననుటకు మారుగా "నిర్మాణచాతుర్యము గల" అనుట సమంజస మని తోచుచున్నది. లాభకరము అనుటచేత లాభము తీయుటే ప్రధానమై విద్యాభివృద్ధిమాట అప్రధానము చేయబడినటుల అర్థము చేయబడుచున్నది. వార్ధావిధానము వృత్తికర్మయందలి విద్యాప్రబోధాంశమునకే ప్రాధాన్యత గలదని మా అభిప్రాయము. పైతరగతులలో అమ్ముడుపోవు వస్తుజాలమును నిర్మాణము చేయించుట ఆక్షేపణీయము కాదు. అమ్ముడుపోదగిన వస్తువుల నిర్మాణము కాగల్గినగాని విద్యయొక్క ప్రయోజన ఫలితార్థములు తృప్తికరము అనుటకు వీలు లేదనుట సత్యమే. ఆ వస్తువుల అమ్మకము వలన వచ్చు సొమ్మును పాఠశాల పోషణకు చక్కగా వినియోగించవచ్చును.

ఆశయము

ఇంకొక విషయము గమనింప దగియున్నది. సెంట్రలు అడ్వైజరీబోర్డు ఆఫ్ ఎడ్యుకేషనువారి ఆమోదమును బడసిన కమిటీ సిఫారసులు కూడ రాష్ట్రప్రభుత్వము వారనువర్తింపవలసిన నిర్బంధములేదు. విద్యావిషయమునందు అభిమానము గల అధికారివర్గముచేత ఒసగబడు సలహాల రూపముననే ఆ సిఫారసులు చేయబడినవి. ఈ సలహాలను తమ దృష్టిలో పెట్టుకొని తమ విద్యావిధానమును పరిశోధించుకొని ఉచితప్రణాళికను రాష్ట్రప్రభుత్వములు సిద్ధముచేసికోవలసి యున్నవి. ఆయా రాష్ట్రవిద్యాశాఖాధికారులు వార్ధావిధానమును పూర్ణముగ పరిశీలించి ప్రధానాప్రధాన సూత్రముల విచక్షణచేసి, తమ రాష్ట్రావసరములకు అర్హమగు తీరున ప్రాథమిక వృత్తికర్మాధారవిద్యాలయముల నెలకొలుపుదురు గాక!

ఓం తత్సత్

